సీతారాములు.

# సత్యథ

## ఉత్తరాది మఠాధీశులు

వై. భీమరావ స్వామిరావ కమలాపుర
గ్రంథకర్త.

కాళహాడి వ్యాసమూర్తి
అనువాదకర్త.

ఈ పుస్తకమును కన్నడభాషలో 'వై. భీమరావస్వామి రావ కమలాపుర' అనువారు రచించియున్నారు. తెనుగుభాషలో దీని కనువాదము గావించుటకు శ్రీ H. B. Kamalapur B. A., Mamladar, Dharwar గారు దయతో ననుమతించిరి. వారికి నే నెంతయు కృతజ్ఞుడను.

కాకూరి వ్యాసమూర్తి

# పీ ఠి క

వైష్ణవమతమునందు (ద్వైతసిద్ధాంతమందు) గురువు, పరమగురువునుండి చతుర్ముఖబ్రహ్మపర్యంతము 'గురుపరంపర' అను సిద్ధాంతము గలదు. ఆచతుర్ముఖబ్రహ్మనుండి యారంభమైన, క్రమముగా వచ్చుచున్న గురుపరంపరయే స్వాముల వారల పరంపరయని ద్వైతులందరు అంగీకరించియున్నారు. నారాయణు డాదిగాగల గురుపరంపర నారాధించుట ద్వైతమతసంప్రదాయమై యున్నది.

ద్వైతమతమును పునరుద్ధరించినవారు మధ్వాచార్యుల వారు. కావున వారినుండి గురుపరంపర యెల్లఱకు విశదమై యున్నది. మధ్వాచార్యులనుండి నేటివఱకు నేర్పడియున్న గురుపరంపరయం దెప్పటికి- యీ ౨౦౦ సంవత్సరములకు ౩ శాఖలు బయలుదేరినవి. ఇందే మతమునకు సంబంధించినవారా గురుపరంపర నారాధించుచున్నారు. * అన్ని శాఖలవారికి మధ్వాచార్యులవారు ముఖ్యమైయున్నారు.

మధ్వవిజయమందు మధ్వాచార్యులవారుడిపిలో కృష్ణవిగ్రహమును బ్రతిష్ఠింపజేసినట్లు గలదు. పైశాఖలందేర్పడియున్న వంతేవిగ్రహములగూర్చిగాని యందుల్లేఖింప

* అచ్యుతప్రేక్షులవారివలన నేర్పడిన భీమనకట్టెమఠము భిన్న రీతి నున్నది.

బడలేదు. కృష్ణవిగ్రహమునుగూడ మధ్వాచార్యులవారు పూజించినట్లు మధ్వవిజయమందు లేదు. మధ్వాచార్యులవారు సకలకాలమును పాఠప్రవచనమందు వినియోగించుచుండెడివారని మధ్వవిజయము ౧౪సర్గయందు నిరూపింపబడియున్నది. ఉదయాస్తమానములందు భగవద్ధ్యాననిమగ్నులైయుండి యపరాహ్ణసమయమున దేవతార్చనము గావించుచుండెడివారని యందు గలదు. దేవతార్చనవిషయమతిస్వల్పకాలములో ముగించుచుండెడివారని యీసర్గనుపరికించిన స్పష్టము కాగలదు. మఱియు నాసర్గలో 32 శ్లోకమున దేవతార్చన మనునది మధ్వాచార్యులవారికి నిమిత్తమాత్రమే యనియు, వారు సదా మానసికారాధనతత్పరులనియు స్పష్టము చెప్పబడియున్నది. కాగా మధ్వాచార్యులవారికి ముఖ్యవిషయమైనది పాఠప్రవచనమని మధ్వవిజయమందు స్పష్టము కాగలదు. తురీయాశ్రమమొందిన మధ్వాచార్యులవారు భాష్యమును రచించకముందు అద్వైతభాష్యమునే యెల్లరకుజెప్పువారైరి.

*వ్యాఖ్యాః కదాచి న్మణిమ ద్వినిర్మితం
భాష్యం జనై స్తర్కవిశారదై ర్వృతః
ఉవాచ వాచం పరిహాసహాసవాక్
సమోహ్నదతీర్థ స్సురమోదదాయినీమ్. మధ్వ. ౫-౧౨

* శంకరభాష్య ముల్లేఖింపబడినదిగాని శ్రీభాష్య ముల్లేఖింపబడలేదు. ఈగాంభీర్యము గమనింపదగినది.

(ఒకప్పుడు మధ్వాచార్యులవారు తర్క విశారదులవద్ద పరిహాసహాసమున నద్వైతభాష్యమును వ్యాఖ్యానించిరి.)

దీనివలన భాష్యప్రవచనమే గురువులకు (సన్యాసులకు) ముఖ్యప్రవృత్తియని వ్యక్తమగుచున్నది. ఆముఖ్య ప్రవృత్తిగల్గినవారు పద్మనాభతీర్థులు మాత్రమే యని మధ్వవిజయము ౯, ౧౦సర్గములవలన సుస్పష్టము కాగలదు.

*మధ్వాచార్యులవారే మఠమునుగూడ స్థాపించినట్లు మధ్వవిజయమందు లేదు. కావున నెల్లమఠములవారికి సంప్రదాయమే యాధారముగా నున్నది. మధ్వవిజయమందు ఘనముగా ప్రశంసింపబడిన, కావుననే మధ్వాచార్యులవారి కతి ముఖ్యులని వ్యక్తమైన పద్మనాభతీర్థులవారి సంప్రదాయము ప్రకారము ఉత్తరాదిమఠమునకు జెందినవారైరి. సుధామంగళ మాచరించుటయే యన్నిమఠములందు పరమముఖ్యమగుచున్నది. సుధాగ్రంధకర్తలు జయతీర్థులు ఉత్తరాది మఠమునకు జెందినవారైరి.

ఆశ్రమ మిచ్చు విషయము వేఱు పీఠాధిపత్య మిచ్చు విషయము వేఱుగా నీగురుపరంపరయందు దటస్థించినది. కావున జ్యేష్ఠులే (మొదట నాశ్రమము స్వీకరించినవారే) పీఠాధిపతులు కావలెనను నియమ మేమఠమునందును నేర్పడ

* మధ్వవిజయము మధ్వాచార్యులవారిచరిత్రమును సంపూర్ణముగా వివరించుచున్నది.

లేదు. అందువలననే యిన్ని మతములు వెలువడుటకు నూర్ణ్యమైనది. దేశకాలము లిట్టివ్యవస్థను గల్గించినది.

ద్వైతమతమునం దొకసిద్ధాంత మున్నది. హెచ్చు వైష్ణవు లున్నవైపు ప్రయోగ్గవలెనని మధ్వాచార్యులవారు మహాభారతతాత్పర్యనిర్ణయములో లిఖించియున్నారు. ఇందలి పరమార్థము నన్నిమతములవారు ననుసరించుట శ్రేయోదాయక మగును.

ఉడిపీమతములన్నియు గ్రామనామములై యున్నవి. వ్యాసరాయమతము, రాఘవేంద్రమతము మొదలగుమతములకా యా మతములందివి ప్రసిద్ధయతులవలన నాయానామము లేర్పడినవి. పీఠాధిదైవము పేరుగా నేమతముగూడ వ్యవహారమగుట లేదు. మధ్వాచార్యులవా రచ్యుతప్రేక్షులవలన యత్యాశ్రమమును స్వీకరించి గురుదర్శనార్థ ముత్తరాదికి సంచారము సాగించిరి. బదరీకి బోయిరి. గుర్వాజ్ఞానుసారము మధ్వాచార్యులవారు భాష్యమును ఉత్తరాదినే రచించిరి. ఆభాష్యమును మొదట బ్రశంసగావించినవా రుత్తరాది సూరులు శోభనభట్టు (పద్మనాభతీర్థులు).

ద్వైతమతమునందు గురుపూజ (బృందావనపూజ) నిత్యకర్మగా నున్నది. అన్నిమతములవారు దీని నాచరించుచున్నారు. మధ్వభాష్యప్రవచనము ఘనముగా గావించిన పద్మనాభతీర్థులవారి బృందావనము, సుధాగ్రంథకర్తలగు

టీకాకృత్పాదుల బృందావనము ఉత్తరాదిమఠమునకు సంబంధించినవి. పద్మనాభతీర్థులు మొదలు రామచంద్రతీర్థుల వఱకు—వీరల బృందావనములన్నియు నిప్పటికి ఉత్తరాదిమఠమునకు సంబంధించియున్నవి. వ్యాసరాయమఠమువారు, రాఘవేంద్రమఠమువారు నిందలిపరమార్థమును గమనింపదగియున్నది. జగద్విఖ్యాతులగు పురందరదాసుగారు ఉత్తరాదిపీఠవిగ్రహములను ఘనముగా నామకీర్తన మొనరించియున్నారు. ఈవిశేషమును రాఘవేంద్రమ్యమువారు గమనింపదగియున్నది.

ఆషాఢ శుద్ధ ఏకాదశినాడు ఉడిపిలో తప్తముద్రాధారణము జరుగును. ఆశ్రమజ్యేష్ఠులు తక్కినయతులకు ముద్రాధారణము చేయుదురు. తక్కినయతులు తమతమ మఠీయశిష్యులకు ముద్రాధారణము గావింతురు. ఉడిపీకృష్ణు నర్చించు యతియందు(పర్యాయస్వాములవారియందు) గౌరవ విశేషమును తక్కినయతులు ప్రకటింతురేగాని యెల్లరు శిష్యులు ఉడిపీకృష్ణపీఠమునకు సంబంధించినవారని వ్యవహరింపరు. కావున నుడిపియందు ప్రధానమఠమను వ్యవస్థ తటస్థించలేదు. పర్యాయమను విషయము వాదిరాజస్వాముల వారినాడేర్పడినది. దానితో నష్టమఠములవారికి సర్వకాలము స్వాంతమనదగు నుడిపీకృష్ణు డదిమొదలు ఉమ్మడివిషయముగా (అవిభక్తముగా) నష్టమఠములవారి కేర్పడినది పీఠాధిదైవములే యష్టమఠములవారికి ప్రధానదైవము లయ్యె

నవి. ఉడిపీకృష్ణుని సర్వకాలముల నర్చించుటయను వ్యవస్థ సడలిపోయినది. సర్వత్రి విదితాత్ములు, భవిష్యద్బ్రహ్మలు నగు మధ్వాచార్యులవారు అనునిత్యము ఉడిపీకృష్ణుని నివేదనము స్వాయముగావింతురను విశేషమును దెల్పు ఉడిపీమఠముల స్వాములవారలు కొన్నిసంవత్సరములపాటు ఉడిపీకృష్ణు నారాధనమునకు సంబంధము లేనివారగుట, ఉడిపీకృష్ణుని విడచి గ్రామాంతరములందు, దేశాంతరములందు వర్తించుటయు నిందావలన నేర్పడినదిగా నగుచున్నది. ఉత్తరాదిమఠాధ్యక్షసమగు మూలరాముని సదా చేవించుచు, తదర్థదైవమునుపడిచి ప్రివృత్తియే లేనివారైయున్న యుత్తరాదిమఠాధీశులు సదా హరిగురువుల నారాధించుచున్నారను విశేషమును ఉడిపీమఠానుయాయు లందఱు గుర్తింపదగియున్నది.

మధ్వాచార్యులవారు ప్రధానముగా నాచరించిన భాష్యప్రవచనము, ముద్రాధారణవిషయము- ఈసుదర్శనద్వయము ఉత్తరాదిమఠగురుపరంపర ప్రధానముగా గల్గియున్నది. ఉత్తరాదిమఠాధీశులు బహువైష్ణవజనమును నుద్ధరించుచున్నవారలుగా నున్నారు. ఉత్తరాదిమఠానుయాయులిది గుర్తింపవలయును. మఱియు వ్యాసరాయులు, రాఘవేంద్రతీర్థులు, వాది రాజులు, శ్రీపాదరాయలు, విజయధ్వజులు మున్నగు వైష్ణవశిఖామణులు, యతిరాజులు, ద్వైతసిద్ధాంతమును విశేషవ్యాప్తి నొందించి యుద్ధరించియున్నా

రన్ని విశేషమును గుర్తించి యన్నిమతములందు సమానబుద్ధి గల్గి ప్రవర్తింపదగినవారై యున్నారు.

'సత్కథ' అను పేరున కన్నడభాషలో 'వై భీమరావ స్వామిరావ. కమలాపుర'అను వారీ గ్రంథమును రచించి యున్నారు. ఈగ్రంథము నాంధ్రభాషలో ననువదించుటకు నాకు శ్రీ H. B. Kamalapur B. A., Mamaldar Dharwar గారు దయతో ననుమతి నొసంగినారు. వారికి నేనెంతయు కృతజ్ఞుడను. సత్కథనుండి ఉత్తరాదిగురుపరంపరనుమాత్రమే యాంధ్రీకరించి ప్రకటించుచున్నాను. మఱికొన్ని గ్రంథము లనుగూడ చదివి యీగ్రంథమును రచించియున్నాను. సత్కథయందు సత్యజ్ఞానతీర్థులవారివఱకే చరితములు ప్రక టింపబడియున్నవి.

ఈగ్రంథమును ముద్రించుటకు రాజమహేంద్రవరము సత్యజ్ఞాననిధికార్యకర్తలు రూ 100 లు కటాక్షించిరి. కొఠీ జానికమ్మగారు రూ 50 లు సహాయముచేసిరి. శ్రీ ద్రోణం రాజు కామేశ్వరరావు పంతులుగారు(రాజమహేంద్రవరము) నాకృషియం దాదరము చూపి గ్రంథముద్రణ మగునట్లు దోహదము గావించిరి. వీరందఱకు నాకృతజ్ఞతను దెల్పు చున్నాను.

మాతండ్రిగారు కాఖూరి హనుమంతాచార్యులుగారు వారికి వ్యాసపూజాధికారము (కట్టెపురాణము) లభించినపుడు నేను పుట్టినందున వారు నాకు వ్యాసమూర్తి అనుపేరు

పెట్టిరి. సత్యప్రజ్ఞతీర్థులవారు నాకు మఠాధికారము, కర్ణాట పురాణాధికారము (విజయనగరము) దయచేసియున్నారు.

స్మార్తము (ఋగ్వేదము, యజుర్వేదము)సాహిత్యము, భాష్యము తండ్రిగారు హనుమంతాచార్యులుగారు చెప్పియున్నారు. ఇంగ్లీషు చదువు దత్తతతండ్రిగారు రామమూర్త్యాచార్యులుగారు చెప్పించినారు. మాయావాదఖండనము అను ఒక్కప్రకరణము ప్రపంచం శ్రీనివాసాచార్యులుగారు చెప్పినారు. మూలరామప్రియ కానుకుర్తి వెంకటకృష్ణారావు పంతులుగారు నాయభివృద్ధికి దోహద మొనర్చియున్నారు.

విజయనగరము }
శా. శ. ౧౮౮౦ } కాఖూరి వ్యాసమూర్తి అనువాదకర్త

శ్రీసత్యప్రమోదతీర్థులవారు ఉత్తరాదిమఠము ద్వితీయమండలమునకు మొదటి యతిపతులుగా విలసిల్లుచున్నారు. పూర్వాశ్రమనామము గుప్త్త గురురాయాచార్యులుగారు. 29వయేట వీరు పీఠాధిపత్యము వహించిరి. పాఠప్రవచనము గావించుచు నశేషభక్తజనులను దరింపజేయుచు శ్రీవారు భారతదేశమందు విద్వదామోదమును గల్గించుచున్నారు. శ్రీవారికి సాష్టాంగ దండప్రణామము లాచరించుచున్నాను.

కాఖూరి వ్యాసమూర్తి.

---

# సత్యార్థ

## గురుపరంపర

(ఉత్తరాదిమఠము)

ద్వాపరాంతమున వ్యాపింపజేయబడిన జ్ఞాన మాకులీభూతముకాగా బౌద్ధాదిమతములు వ్యాప్తినిజెంది భారతదేశమును పీడింపజొచ్చినవి. వైదికమతోద్ధారణార్థము ప్రయత్నించినవారు అప్పటిలో బ్రహ్మసూత్రములకు ౨౧ భాష్యములు రచించియున్నారు.

(1) భారతీవిజయ (2) సచ్చిదానంద (3) బ్రహ్మఘోష
(4) శతానంద (5) ఉద్ధత (6) విజయ (7) రుద్రభట్ట
(8) వామన (9) యాదవప్రకాశ (10) రామానుజ
(11) భర్తృప్రపంచ (12) ద్రవిడ (13) బ్రహ్మదత్త
(14) భాస్కర (15) పిశాచ (16) వృత్తికార
(17) విజయభట్ట (18) విష్ణుక్రాంత (19) వాదీంద్ర
(20) మాధవదాస (21) శంకర మొదలగునవి.

ఈ భాష్యములు వ్యాప్తిలోనికి వచ్చిన సందర్భమున శ్రీ మధ్వాచార్యులవా రుద్భవించి నిర్ణయాత్మకము సుబోధకమునగు భాష్యమును రచించి లోకమునకు గటాక్షించినారు.

సకలశాస్త్రార్థ నిర్ణయాత్మకమగు భాష్యము సిస్సుగా రచించి తన్నిదర్శనరూపముగ మహాభారత తాత్పర్యనిర్ణయ మను గ్రంథమునుగూడ రచించినారు. వాటియందు శ్రీమదాచార్యులు ప్రసాదించిన తత్త్వము ఇహపరసాధనమై యున్నది.

సజ్జనోద్ధారణార్థము పరమాత్మ సృష్టిగావించుచున్నాడు. అవాప్త సమస్తకాముడగు పరమాత్మని దివ్యలీలలో నిది యొకటిగా నున్నది. పరమాత్మ తన యుదరమందనాదిగా ప్రకృతి బద్ధులుగానున్న, స్వరూపమున నిత్యులైన, అనంతమైయున్న జీవగణములనుండి సద్యస్సృష్టులగునట్టి (అపుడు సృష్టికి రాదగినట్టి) జీవుల నేటి సృష్టికి దెచ్చుచున్నాడు. తారతమ్య స్వరూపులగు జీవులను, అనాదిగా నున్న వారి కర్మలను, స్వరూపభూతమగు వారి యోగ్యతల ననుసరించి సృష్టిక్రమ మేర్పఱచుచున్నాడు. అందు మోక్షయోగ్యజీవులకు (దేవతలు, ఋషులు, పితృదేవతలు, చక్రవర్తులు, మనుష్యోత్తములు మొదలగువారికి) మోక్షము గలిగించుచున్నాడు. (ప్రకృతి బంధమును విడిపించి స్వస్వరూపానందము గల్గించుచున్నాడు.) తమోయోగ్యులకు (దైత్యులు, రాక్షసులు, పిశాచులు, మనుష్యాధములు మొదలగువారికి) నిత్యనరకమును గలిగించుచున్నాడు. నిత్యసంసారులకు మధ్యమగతిని గలిగించుచున్నాడు. ఈ రీతిగ యోగ్యతానుసారము మరి యా జీవులు గావించిన సాధన ననుసరించి సర్వస్వతంత్రుడగు పరమాత్మ వారివారికి తరతమయుక్తమైన వివిధగతులను గలిగించుచున్నాడు.

జీవరాసులన్నియు ప్రయోజనము నుద్దేశించియే ప్రియత్నపరములగుచున్నవి. వివిధములుగా నేర్పడియున్న ప్రకృతిని బురస్కరించుకొనియే సకలోపాధులయందు జిక్కియున్న జీవులు తమతమ ప్రయత్నములు సాగించునవియై యున్నవి. అవ్యాజకరుణగలిగిన పరమాత్మ ప్రయత్నపరులై యున్న జీవులను వారివారి యోగ్యతల ననుసరించి సరిజూచుచుండును. ఈ ప్రకారము బ్రహ్మమొదలు తృణజీవులుపర్యంతము జీవులందఱు నాపరమాత్మవలన క్రమముగా నుద్ధరింపబడువారై యున్నారు.

ప్రకృతి త్రిగుణాత్మకమైనది. అందు సాత్వికగుణము జ్ఞానమును కలిగించును. రజోగుణము దుఃఖమును, తమోగుణము అజ్ఞానమును కలిగించును. సంతతము ప్రయత్నపరుడుగా నేర్పడియున్న(ఆహార విహారాదులయందు నిమగ్నుడైన) జీవుడు సాత్విక సంపద కలిగినవాడై (సాత్వికశ్రద్ధ సాత్వికతపస్సు, సాత్వికాహారము మున్నగునవి అలవరించుకొని) జితేంద్రియుడగుచు నుద్ధార మొందుచున్నాడు. తత్ప్రయత్నముననున్న యోగ్యజీవుడు ప్రత్యక్షమున (చూచుట, వినుట మున్నగువాటివలన) అనుమానమున (శాస్త్రానుగుణ్యమగు తర్కమున) ఆగమనమున (విశ్వమానవకల్యాణార్థ మేర్పడిన గ్రంథములు చదువుట, వినుట వలన) తనప్రవర్తనను సరిచూచుకొనుచు (సరిదిద్దుకొనుచు) ముందడుగు వేయుచుండును. శాస్త్రవిధిని విడనాడి తనకు

దోచినరీతిని (కామకారతః) ప్రవర్తించువాడు సిద్ధిపొందజాల డనియు, ఇహసుఖముగాని, పరగతిగాని వానికేర్పడదనియు శాస్త్రమున, లోకమున నవగాహన మొనరించుకొనినవాడై యా సాధకజీవుడు కార్యాకార్య వ్యవస్థయందు శాస్త్రమే ప్రమాణమని నిశ్చయించుకొని శాస్త్రవిధానోక్తముగా గర్మల నాచరించి ఇహపరములను సాధించుకొనుచున్నాడు. విష్ణుమాయ దురత్యయమైనది. ఆతని పొందువాగే యా మాయను దాటగల్గుదురు. ప్రయత్నపరుడగు అధికారికి విషయవినివర్తనము మాత్రమే యేర్పడును. (నాది కాదు అని తలంచునుగాని ఇచ్ఛ మాత్రము సమూలము పోవునది గాదని యభిప్రాయము.) ప్రాకృత సుఖమును నతిక్రమించు నట్టి యానంద మపరోక్షమున నేర్పడును. అపుడే యా రస నివర్తన మా సాధకునకు గాగలదు. కావున 'మాయ' యనగా ప్రకృతిగను, లక్ష్మిగను నొప్పుచున్నది. ప్రకృతిని దాటుట కుగాను ప్రకృత్యభిమానియైన లక్ష్మి పురుషకార మొనర్చును. (అక్షర నామకురాలైన, సదాముక్తురాలైన లక్ష్మి సహాయ కారి యగును. కావున నిష్కామకర్మగావించుయోగి సమస్త మును భగవదర్పణముగావించువాడై లక్ష్మిద్వారా నారాయ ణుని నుపాసించు వాడగుచున్నాడు.) ఆమాయ యపుడు భగవ దిచ్ఛగా నేర్పడి ముక్త్యవస్థను గల్గించును. (మాయ యనగా "ప్రకృతి" యనియు, "లక్ష్మి" యనియు, "భగవ దిచ్ఛ" యనియు మధ్వాచార్యులు నిర్వచనము గావించి

యున్నారు.) సత్వగుణమునకు విష్ణు వధిపతి. రజోగుణమునకు బ్రహ్మయు, తమోగుణమునకు రుద్రుడు, మనస్సు, ఇంద్రియములు మున్నగువానికి దేవతలును అధిపతులై యున్నారు. జ్ఞానప్రకాశకమగు సత్వగుణము నాశ్రయించిననే జీవగణోద్దార మేర్పడుచున్నది. కావుననే విష్ణువు "నాభక్తుడు చెడిపోడనియు, దురాచారుడుగనున్నను నన్ను గొలుచువాడు వేగ సాధువుగా నేర్పడగలడనియు, తన్ను గొల్చినవాడు మాత్రమే మోక్ష మందగల" డనియు (శ్రీకృష్ణుడు) దెల్పియున్నాడు. బ్రహ్మ రుద్రాది దేవతలను సాత్వికమార్గమున గాక రాజసిక, తామసిక శ్రద్ధలతో గొల్చువారు దేవతాప్రీతిని గోరక వరరూపముననే ఉభయభ్రష్టులగుచు వచ్చినారు. కావున నితర దేవతలను (బ్రహ్మరుద్రాది దేవతలనందఱును) ప్రత్యేకముగ గాక, విష్ణుపరివారముగ నుపానుపాసించిననే యోగ్యఫలము గల్గుచున్నది. తన గురువు మొదలు బ్రహ్మ వఱకును గురుపరంపరగా నెఱిగి విష్ణుసేవ గావింపవలన యున్నది. అపు డంతయు సాత్వికరూప మేర్పడి (సాత్వికపర్యవసాన మేర్పడి) పరిపక్వమగుచున్నది. ఫలకాలమున బంధవిమోచన మేర్పడుచున్నది. కావుననే మోక్షము జనార్దనునివలననే యిచ్ఛయించవలసినదని శాస్త్ర నిర్ణయమగుచున్నది. ఈరీతిగా సాత్వికగుణము నలవరించుకొనిన (నిత్యసత్వస్థులైన) జీవులు త్రిగుణాతీతుడగు పరమాత్మను— జ్ఞానానందాది (సచ్చిదానందాది) సకలకల్యాణగుణ పరిపూర్ణుని బొంది శాశ్వతానందము ననుభవించు వారగుచున్నారు.

పరమాత్మయొక్క ఆజ్ఞలుగా శ్రుతిస్మృతులున్నవి. బాగుపడువాని కవి సుజ్ఞానము నొసంగుచున్నవి. చెడిపోవు వారు విపరీతజ్ఞాన మొందుచున్నారు. శ్రుతిస్మృతులను నమ్మి వేయు సజ్జనులకు జన్మాదులకు కారణుడైన పరమాత్మయందు భక్తి గలుగుచున్నది. సకల వేదశాస్త్రములందు చెల్పబడిన పరమాత్మయొక్క మహిమాజ్ఞానమును వారు పొందువారగు చున్నారు. ఎన్ని సంకటములు ప్రాప్తించినను విడనాడక, భార్యాపుత్రాదులకంటెను, సంఘము, దేశముకంటెను అధిక మైనదిగా నెంచుకొని యా పరమాత్మయం దట్టి దృఢము, సర్వాతోధికమునైన స్నేహముగల వారగుచున్నారు. శాస్త్ర మందలి విధినిషేధములను పాటించుచు, దైవానుగ్రహము నకు పాత్రులగుచున్నారు. ఎల్లకాలములందును, అహో రాత్రములందు దేవతలు సదా గావించుచున్న మేలిమిని (వర్షము కలిగించుట, పాడిపంటలు కలిగించుట, జీర్ణముగావిం చుట మున్నగు యనేకమైన మేలిమిని) దెలిసి మహోపకారు లగు నా దేవతలందు భక్తిగల వారగుచున్నారు. సమస్త దేవతాంతర్యామియై సకల విశ్వవ్యాపారమునుకొనసాగించుచు, జగదోద్ధార మొనరించుచున్న శ్రీవిష్ణుని సకలవేదశాస్త్రము లందు జింతించి యథాయోగ్యమగు ననుభవ మందుబడసి, స్వయోగ్యమైన యుత్తమ (శాశ్వత) స్థానమును సాధించు కొనువారగుచున్నారు. ఋషులు మంత్రద్రష్టలుగను, స్మృతి కారకులుగను, శాస్త్రనిర్మాతలుగను నున్నారు. భిన్న

భిన్నముగానున్న శృతిస్మృతులను వీరు తమ ప్రవర్తనమూల మున నేకమార్గముగ లోకమునకు జూపియున్నారు. ఇట్టి మహోపకారము గావించిన ఋషుల యందు గురుభావ మొంది సజ్జనులు గురుపరంపర ననుసరించి, యా శాశ్వతస్థానమును పొందగలవారగుచున్నారు. అజ్ఞానులు దేవర్షులయందు భక్తి లేనివారుగను, ద్వేషము గలవారుగనునై సుఖవిహీనులయి అధమగతి నొందుచున్నారు.

మధ్వాచార్యులు సకల వేదశాస్త్రములందున్న యర్థ ములను వివరించుచు, ముప్పదియేడు (37) గ్రంథములు రచించియున్నారు. సకల వేదశాస్త్ర ప్రతిపాద్యములగు కర్మలను నిత్యముగావించు ఆహ్నిక నిర్ణయము (నిత్యనైమి త్తిక కర్మానుష్ఠాన విధానము) చూపించియున్నారు. కావున వారి గ్రంథములు చదివినవారికి వేదాంత పరిభాషమాత్రమే గాక సకల శాస్త్రజ్ఞాన మలవడుచున్నది. ఆతీరున నిత్యనైమి త్తిక కర్మానుష్ఠాన మొనర్చినవారికి సకల శృతిస్మృతి పాలన మగుచున్నది. వీరి లిఖితములందున్న యీ సర్వతోముఖ ముగు వివక్ష యింకొకచోట గానరాదు. కావుననే వీరిగ్రంథ ములకు "సర్వమూలం" అనుప్రసిద్ధి యేర్పడినది. సర్వజ్ఞు లగు మధ్వాచార్య వాఙ్మయమం దింకొక విశేషముగూడ గానవచ్చుచున్నది. వీరు తమభాష్యమందు కేవలము శృతు లను, ఉపనిషత్తులనేకాక సకల గ్రంథములను నుదాహ రించుచు, నర్థనిర్ణయము గావించియున్నారు. మఱియు వేద

మునకు పంచత్వసంఖ్యా పూరకమైన ఇతిహాసపురాణముల తాత్పర్యమును నిర్ణయించుచు వాటి సర్వార్థము నిబిడీకృత మగునట్లుగా మహాభారత తాత్పర్య నిర్ణయమును రచించి యున్నారు. పంచమవేదమని ప్రసిద్ధినొందిన భారతమును విమర్శించుపట్లనే వారి ఘనకార్యమును సాధించుట సందర్భో చితముగ నొప్పియున్నది. కావున ఆనందతీర్థులగు మధ్వా చార్యుల గ్రంథములు సర్వతోముఖముగా బరిణమించి జగ దానందదాయకములగుచున్నవి. ఉపక్రమోపసంహారాదులు వివిధభాషాస్వరూపములు మున్నగు సర్వవిషయములను లక్షించి అనుమాన తీర్థులగు శ్రీమధ్వాచార్యులు గ్రంథ ములు రచించినందున వాక్యార్థము, శ్లోకార్థమే కాకుండ ప్రకరణార్థము, గ్రంథలక్ష్యము వీరి లిఖితములవలన నొంద నగుచున్నవి. అట్టిమహద్భాగ్యమే వీరిగ్రంథములందు పొంద నగుచున్నది. సాధుపరిత్రాణము, దుష్టవినాశము, ధర్మసం స్థాపనము గావించుటకై స్వేచ్ఛగా భువియం దవతరించిన విష్ణువు ఉభయ బాధ్యతలను (లౌకిక పారలౌకికములను) ఏక ప్రకారముగా నిర్వర్తించుననియు, విష్ణ్వాజ్ఞానువర్తులగు దేవ తలు భిన్నరీతిని నిర్వర్తించెదరనియు, (పారలౌకికమందు స్వశక్త్యానుసారముగను, లౌకికమందు తనూన్యూనశక్తులుగను నేర్పడెదరనియు) రచించియున్నారు. విష్ణ్వాది దేవతలంద ఱును భువియం దుద్భవించినపుడు లోకానుసరణ ప్రవృత్తి కలిగియుందురనియు (అట్టి ధర్మమును వారు పాటించెదరనియు

దేశ కాలానుగుణ్యమగు ప్రవర్తనము వారియందు ప్రీతి ఫలించుననియు, పుట్టుట, పెరుగుట, సుఖదుఃఖాదుల నొందుట మున్నగునవి గన్పట్టుచుండుననియు) వారు రచించి యున్నారు. కావున వారిని దేవతలుగను, లోకపాత్రలుగను ఉభయరీతుల నర్థము గావించుకొనవలసినదని లిఖించి యున్నారు. ఆదర్శప్రాయమగు ధర్మము లోకమున బోధింప వచ్చిన దేవతలు వారి చరిత్రల మూలమున ఇహాపర శ్రేయము గలిగించువారై యున్నారని వారి యాశయము. లోకమును, లోకాతీతమును తమయందు మేళవింప జేసుకొనవలసినవారు మానవులు. ఆమానవులు తరించుటకు వీలగునట్టి ప్రవర్తనను, తత్ జ్ఞానమును సుకరముగ మధ్వాచార్యులు తమ గ్రంథములద్వారా ప్రకటించి సార్వకాలిక లోకోపకారకులై నిల నిల్చినారు.

మధ్వాచార్యులు దక్షిణ కన్నడజిల్లాలో మంగుళూరు సమీపమున నున్న "ఉడిపి" యనుగ్రామమునకు సమీపస్థలమందుద్భవించిరి. తండ్రిపేరు మధ్యగేహాభట్టు. తల్లి వేదవతి. ఆ పుణ్యదంపతులు వీరికి "వాసుదేవ" యని నామకరణము గావించిరి. వీరికి పిమ్మట ఆ దంపతుల కింకొక్క సుతుడుకూడ ఉద్భవించెను. బ్రహ్మచర్యమునుండియే మధ్వాచార్యులు అచ్యుతప్రేక్షులను యతివలన సన్యాసమును స్వీకరించిరి.

"మహాభారత తాత్పర్యనిర్ణయము" అను గ్రంథమున మధ్వాచార్యులవారు స్వయము తాము వాయువుయొక్క

మూడవ యవతారమని వ్రాసుకొనియున్నారు. సదా బ్రహ్మ చారిగా హనుమంతుడై రామసేవను, పెద్దగృహస్థుగా భీముడై కృష్ణసేవను, సదా సన్యాసిగా మధ్వాచార్యుడై వేద వ్యాససేవను గావించినట్లు వీరందు సాధించియున్నారు. ఇం దులకనుగుణముగా వీ రమానుష శక్తిసంపన్నులనుటకు శిలా శాసన మొకటి నిదర్శనమై నేడును గానవచ్చుచున్నది. వేయిమంది యెత్తజాలకుండిన పెద్దశిలను వీ రవలీలగా నొక చేత నెత్తి తెచ్చి ప్రతిష్ఠించిన శిలయని యా శాసనము తెల్పుచున్నది. తుంగభద్రాతీరమందు, అంబుతీర్థమున నిది గలదు. ప్రస్తుతము మైసూరు సంస్థానమున మలంగడి, కీలం గడి, రుద్రపాద యను పల్లెలుగానున్న ప్రదేశమున నీ శాసన మున్నది. "మధ్వాచార్యై రేకహస్తేన ఆనీయ స్థాపిత శిలా" అని యందున్నది.

తండ్రి పెట్టిన పేరు "వాసుదేవ". ఆశ్రమనామము "పూర్ణబోధ." బిరుద నామములు "సర్వజ్ఞ, అనుమానతీర్థ" అనునవి. కాని వీరు తమ గ్రంథమందు రచించినది యథార్థ మగుచు వీరికి "మధ్వాచార్యులు" అనునామము ప్రసిద్ధమై నది. "బళిత్థా" అను వాయుసూక్తార్థమందు తమకు "మధ్వ" నామము వైదికసిద్ధమని వీరు వ్రాసియున్నారు. అదియే లోక మందు వాడబడుచున్నది. ఈమతస్థులకు "మాధ్వులు" యను ప్రసిద్ధి యేర్పడినది. ఈవిశేషము గమనింప దగినదిగా నున్నది.

మధ్వాచార్యులు రచించిన గ్రంథములు. (౧) సూత్ర భాష్యము [బ్రహ్మసూత్రములకు భాష్యము] (౨) ఐతరేయ భాష్యము (౩) బృహదారణ్యభాష్యము (౪) ఈశావాస్య భాష్యము (౫) కాఠకభాష్యము (౬) ఛాందోగ్యభాష్యము (౭) అథర్వణభాష్యము (౮) తైతరేయభాష్యము (౯)మాం డూక్యభాష్యము (౧౦) షట్ప్రశ్నభాష్యము (౧౧) తల వకారభాష్యము (౧౨) గీతాతాత్పర్యము [గీతార్థమునకు ప్రమాణాంతరసమ్మతము. సర్వశాస్త్రనిర్ణయము (౧౩) గీతా భాష్యము [పరమతఖండన పూర్వకగీతార్థము](౧౪)మహాభా రత తాత్పర్యనిర్ణయము[ఇతిహాసపురాణవిషయనిర్ణయమిందు గలదు. రామాయణ ముపక్రమమని, భారతముపసంహారమని యిందు నిరూపింపబడినది. రామాయణ భారతములందు పర మాత్మ దేవతలు అందఱు అవతరించియున్నారుగాన నీరెంటి సమన్వయమందు సకలశాస్త్రవినిర్ణయముగలదని సమర్థింప బడినది] (౧౫) భాగవతతాత్పర్యము [భాషాత్రయములు గల్గియున్న పురాణములయొక్క విషయమిందు నిరూపింపబడి నది] (౧౬) తంత్రసారము [మంత్రోద్ధారము, దేవతార్చన విధి, మూర్తిప్రతిష్ఠ] (౧౭) ప్రమాణలక్షణము[ప్రత్యక్షము, అనుమానము, ఆగమము, వీనిలక్షము] (౧౮)కథాలక్షణము [వాదుల లక్షణవాదమునుగూర్చిన గ్రంథము.] (౧౯) తత్త్వవివేకము [తత్త్వనిర్ణయము – తత్త్వవిచారమున కనుకూల మైన ప్రమాణములు] (౨౦) తత్త్వోద్యోతము [భేదసాధన

గ్రంథము] (౨౧) ఉపాధిఖండనము (౨౨) మాయావాద ఖండనము (౨౩) ప్రపంచమిథ్యాత్వానుమానఖండనము (౨౪) తత్త్వసంఖ్యానము (౨౫) అణుభాష్యము [బ్రహ్మసూత్రముల అధికరణార్థమును స్వల్పముగా వివరించునది] (౨౬) యమకభారతము [చిత్రకవిత్వము. గోప్యార్థము, భారత సంక్షేపరూపము, పరమాత్మస్తోత్రము] (౨౭) అనువ్యాఖ్యానము [పరమతఖండనము-ఇందలి నాలుగధ్యాయము ఒకే మాఱుగా నలుగురుశిష్యులేకకాలమున రచించిరి.] (౨౮) న్యాయవివరణము [అనువ్యాఖ్యానవివరణమైనది. సూత్రాధికరణముల పూర్వపక్షయుక్తి, సిద్ధాంతయుక్తి] (౨౯) కృష్ణామృతమహార్ణవము [భగవదర్చనము, స్మరణము, ధ్యానము, వ్రతాచరణము, దినత్రయనిర్ణయము] (౩౦) కర్మనిర్ణయము [యజ్ఞయాగాదులందు ఋక్కుల సంయోజనము] (౩౧) విష్ణుతత్త్వనిర్ణయము [వేదముల అపౌరుషేయవిషయము బింబప్రతిబింబాదివిషయము, పరమతఖండనము] (౩౨) సంహితాభాష్యము [సంహితయందలి ఋక్కులకు అర్థము, వేదార్థమునకంతకు మార్గదర్శకమైన గ్రంథము] (౩౩) యతిప్రణవకల్పము (ప్రణవార్థప్రకాశము, సన్న్యాసగ్రహణవిధి] (౩౪) సదాచారస్మృతి [నిత్యకర్మలయొక్క విచారము] (౩౫) జయంతినిర్ణయము [శ్రీకృష్ణజయంతిని నిర్ణయించునది] (౩౬) ద్వాదశస్తోత్రము (౩౭) నఖస్తుతి.

మధ్వాచార్యులు ఉడిపియందుకృష్ణవిగ్రహమును ప్రతిష్ఠించిరి. యజ్ఞప్రక్రియగావింపించిరి. పరమతఖండనపూర్వకస్వమత

స్థాపన మొనరించి శాలివాహనశకము ౧౧౨౦ పింగళిసం॥ ర॥ మాఘ శు౯ రోజున జగమున నదృశ్యులైరి, అదియే వారి యారాధనదినముగా బరిణమించినది. గురుపరంపరయం దారాధన మనునది గురువులు సిద్ధిపొందినదినముతే పరిణమించుట యుండువలన నేర్పడినది.

## ౨. పద్మనాభతీర్థులు శా॥ శ॥ ౧౧౨౦—౧౧౨౮

బదరికాశ్రమమునుండివచ్చిన మధ్వాచార్యులు భాష్యమును రచించిరి. దానిని సత్యతీర్థులు లేఖనమొనరించిరి. గోదావరీతీరమందు పెద్దసభయొకటి జైనది. ఆసభయందు వరిష్ఠసమ్మతులగు శోభనభట్టు సర్వజ్ఞులకు నమస్కరించి వారి భాష్యమును శ్రవణముచేసిరి. మధ్వభాష్యమహిమను ఘనముగా వర్ణించిరి. (మధ్వ ౯—౧౮-౨౮) విష్ణుమంగళమను స్థలమున మధ్వాచార్యులు కొన్నినాళ్లు భాష్యప్రవచనము జరిగించిరి. అపుడు సుబ్రహ్మణ్యసూరిపుత్రులు నారాయణపండితాచార్యుల (మధ్వవిజయగ్రంథకర్త) పితయునగు త్రివిక్రమపండితాచార్యులతో మధ్వాచార్యులకు పదునైదుదినములు వాదమేర్పడినది. త్రివిక్రమపండితాచార్యులు మధ్వాచార్యులకు ప్రణమిల్లి శిష్యులైరి. త్రివిక్రమపండితాచార్యులు హరివాయుస్తుతి, తత్వప్రదీపము (సూత్రభాష్యటీక) రచించిరి. మధ్వానుజులు మధ్వాచార్యులవలన యత్యాశ్రమమును స్వీకరించిరి. విష్ణుతీర్థులని వారి కాశ్రమనామ మేర్పడినది.

'మధ్వదాసులలో నేనే అగ్రేసరుడనుకావలెను. అని విష్ణు తీర్థులు మనసా తలంచిరి. (మధ్వ ౧౫-౧౦.౨) తపోనిష్ఠాగరిష్ఠులగు విష్ణుతీర్థులు పర్వతములందు వసింపజొచ్చిరి. ఈవిష్ణు తీర్థుల మహిమావిశేషము దొడ్డది. (మధ్వ ౧౫ ౯౨-౧౧౪)

ఆకృష్టోఽస్యగుణైర్వ్యాప్తైర్గోదాయా ఉపాయయౌ
సపద్మనాభతీర్థాఖ్యః శిష్యోఽనోఽభూత్సుచేతసః౧౫. ౧౨౦

(వ్యాప్తమైన మధ్వగుణములచే నాకృష్టులగు గోదావరీతీరమునుండివచ్చియున్న పద్మనాభతీర్థులు మధ్వాచార్యుల కింకొక శిష్యులైరి.)

పద్మనాభతీర్థుల పూర్వాశ్రమనామము శోభనభట్టు. 'మధ్వశిష్యులలో ప్రజ్ఞావిశేషము ఘనముగాగల్గినవారు. పరమతఖండన పూర్వకస్వమతస్థాపనమొనర్చినఘనులు' అని పద్మనాభతీర్థులనుగూర్చి మధ్వవిజయమందు ఘనముగా వర్ణింపబడినది.(౫౫-౧౨౧-౧౨౫) చివరశ్లోకమందు వారి వేద వ్యాఖ్యానమిట్లు వర్ణింపబడినది.

వేదప్రవచనాచార్యశిష్యో సావిత్రిపూజితః
సభ్యః సభాయాం యో వేదం వ్యాచఖ్యౌ వేదసారవిత్
౧౫-౧౨౬

(వేదప్రవచనాచార్యులగు మధ్వాచార్యులకు శిష్యులైన, సభాపూజ్యులైన, వేదసారవేత్తయైన పద్మనాభతీర్థులు సభలో వేదవ్యాఖ్యానమొనరించిరి.)

మధ్వవిజయమందు శోభనభట్టు విశేషము ౧౧ శ్లోకములలో వర్ణింపబడినది. (౯—౧౭—౨౭) మధ్వానుజులగు విష్ణుతీర్థుల గుణగణములు ౨౩ శ్లోకములలో వర్ణింపబడినవి (౧౫-౯౨—౧౧౪) పద్మనాభతీర్థుల మహిమావిశేషము ౭ శ్లోకములలో వర్ణింపబడినది.(౧౫.౧౨౦-౧౨౬) ఆపిమ్మట నిట్లుగలదు.

అనయోః ప్రథమే శిష్యా శ్చరమే చా భవాన్నిహ
అనంతబోధస్యానేకే యతీంద్రా బహుదేశజాః ౧౫.౧౨౭

(విష్ణుతీర్థులు, పద్మనాభతీర్థులు వీరిద్దఱికి ముందుగను, పిమ్మటను మధ్వాచార్యుల శిష్యులైనవారు యతీంద్రులు బహుదేశములవారుగలరు.)

మధ్వాచార్యులకు యతీంద్రులనేకులు శిష్యులు గలరు. వారు బహుదేశములవారు, వారందఱిలోను విష్ణుతీర్థులు, ♦ పద్మనాభతీర్థులు ప్రముఖులని యీశ్లోకము నిర్ణ

♦ మధ్వవిజయమందు మధ్వాచార్యుల పూర్వాశ్రమనామము, యత్యాశ్రమనామముగలదు. అట్లే పద్మనాభతీర్థుల పూర్వాశ్రమనామము యత్యాశ్రమనామముగలదు. ఈయుభయులవిషయమందుమాత్రమే యీ విశేషముగలదు. అచ్యుతప్రేక్షకులదిగాని, ఇంకెవరిదిగాని పూర్వాశ్రమ నామము గ్రంథమం దుల్లేఖింపబడలేదు. ఇది గమనింపదగినది. గ్రంథమునకు మధ్వవిజయమని పేరు. మధ్వాచార్యుల విజయమును వర్ణించునదాగ్రంథ మనిభావము. ఆమధ్వవిజయమందు మధ్వాచార్యులకుబిమ్మట పద్మనాభ తీర్థులవిజయము ఘనముగా వర్ణింపబడియున్నది,

యించుచున్నది. వీరిద్దఱిలో మొదటివాడు పద్మనాభతీర్థులు, పిమ్మటవారు విష్ణుతీర్థులు. ప్రధానశిష్యులు వీరిద్దఱుననిగ్రంథము నిరూపించుచు తక్కిన యతీంద్రులనుగూర్చి(మధ్వశిష్యులను గూర్చి వారిగుణగణములనుగూర్చి) మొత్తముగా ౪ శ్లోకములలోనిట్లు వర్ణించుచున్నది.

వశీకృతహృషీకాశ్చ జననాద్యుదమర్దినః
నరసింహపదాధారా అభ్యస్తోపేంద్రనామకాః ౧౨౮
అదీర్ఘన్యాభిధానా యే శ్రీమద్రామపదాశ్రయాః
అప్రత్యక్షగుణోద్రిక్తా భక్తివైరాగ్యసాగరాః ౧౨౯
పాదైః పునంతః పృథివీం దర్శయంతో హరేః పదమ్
ఘాతదుస్సమయధ్వాంతా ఆదిత్యా ఇవగాం గతాః ౧౩౦
మోక్షశాస్త్రామృతాంబోధిసేవయా నిత్యనిర్వృతాః
చక్రిచారుతరార్చాసు చక్రిణశ్చరణార్చకాః ౧౩౧

(యతీంద్రులగు మధ్వశిష్యులు వశీకృతహృషీకులు (ఇంద్రియనిగ్రహము గల్గినవారు.) జననాదులను జయించినవారు, నరసింహపదాధారులు, అభ్యస్తోపేంద్ర నామకులు, అదీర్ఘాన్యాభిధానులు, శ్రీమద్రామపదాశ్రయులు, అప్రత్యక్షగుణోద్రిక్తులు, భూమికి దిగివచ్చినసూర్యులట్లు యతీంద్రులగు నీమధ్వశిష్యులందఱు భూమిని పవిత్రింపజేయుచు, హరిపదమును గనబఱచుచు, దుస్సమయధ్వాంతమును బోగొట్టుచు, మోక్షశాస్త్రామృతాంబోధిని మునింగియానందమొందుచు, శ్రీహరిపాదపద్మముల నర్చించువారై విలసిల్లిరి.

♦ ౧ వశీకృతహృషీకాః ౨ జననాద్యుపమర్దినః
౩ నరసింహపదాధారాః ౪ అభ్యస్తోపేంద్రనామకాః
౫ అదీర్ఘానన్యాభిధానాః ౬ శ్రీమద్రామపదాశ్రయాః
౭ అప్రత్యక్షగుణోద్రిక్తాః ౮ భక్తివైరాగ్యసాగరాః.

ఇట్లుగానీ రెండుశ్లోకములందు బహువచనములు గలవు. మొత్తముగా మధ్వశిష్యులగు యతీంద్రుల గుణగణముల నిట్లు నాల్గుశ్లోకములలో గ్రంథకర్త వర్ణించి పిమ్మట మధ్వప్రశిష్యులనుగూర్చి వర్ణించినాడు. (౧౫-౧౩౨-౧౩౪) మధ్వప్రశిష్యులగు యతుల గుణగణములను మూడుశ్లోకములలో వర్ణించి యాపిమ్మట గ్రంథకర్త మధ్వశిష్యులగు గృహస్థులను వర్ణించెను.

బహవో గృహిణో హ్యస్మాత్సమగ్రానుగ్రహం యయుః
దీప్తా యతాగ్నయ ఇవ త్రయో లికుచశేఖరాః

౧౫-౧౩౫

(అనేకులు గృహస్థులును మధ్వాచార్యుల సమగ్రానుగ్రహమును బొందిరి. అట్టిగృహస్థులలో లికుచవంశశేఖరులు ముగ్గురు.)

---

♦ ౧ 'హృషీకః' అనిగాని 'హృషీకేశః' అనిగాని యిచ్చటలేదు. ముందుగా 'వశీకృత' అనువిశేషణముగల దు "హృషీకాః" అని బహువచనమై యుదియున్నది. ఇట్లుగా నిచ్చోట నెనిమిదివిశేషములు మధ్వశిష్యులను గూర్చి యుండుట్లు గమనింపవగినది.

యతీంద్రులలో ముఖ్యు లిద్దఱు

౧ విష్ణుతీర్థులు  ౨ పద్మనాభతీర్థులు,

* గృహస్థులలో ముఖ్యులు ముగ్గుఱు

౧ సుబ్రహ్మణ్యులు  ౨ త్రివిక్రమపండితాచార్యులు

3 నారాయణపండితాచార్యులు.

ఇట్లుగా నీశ్లోకములవలన నిర్ధారణమగుచున్నది. మధ్వశిష్యులగు గృహస్థుల గుణములను రెండుశ్లోకములలోవర్ణించి గ్రంథకర్త మాధ్వులనందఱిని పిమ్మట నొకశ్లోకములో వర్ణించెను. (౧౩౭)గ్రంథమందుపిమ్మటమధ్వానుగ్రహమువర్ణింపబడినది. (౧౩౮) ఆపిమ్మట మధ్వశిష్యప్రశిష్యులపరమయోగ్యత వర్ణింపబడినది. (౧౩౭) మధ్వాచార్యుల చాతుర్మాస్యదీక్ష వర్ణింపబడినది. (౧౪౦) ఫలస్తుతి చివరగా వర్ణింపబడినది. (౧౪౧)

బదరీయాత్రనుండి వచ్చిన మధ్వాచార్యులు భాష్యమును రచించిరి. భాష్యప్రవచనము గావించుచు నుడిపికి వచ్చిరి. భాష్యము ముందుగా నచ్యుతప్రేక్షులకు బంపియుండిరి. మధ్వాచార్యులు ఉడిపిలో నచ్యుతప్రేక్షులకు భాష్యమువర్ణించి వారినుద్ధరించిరి. (౯.౨౯-౩౮)

---

* గృహస్థులలో ముఖ్యులు ముగ్గుఱని యిందుగలదు. వారుముగ్గుఱు లికుచవంశశేఖరులు. ఈలికుచవంశమువారే అచ్యుతప్రేక్షులుకూడ (జ్యేష్ఠో యతి ర్యో లికుచాన్వయోద్భవః మధ్వ ౫—౨౭)

‡ సజ్జనాన్సహ మహాదరేణన్యానాప్పినాం ప్రకృతియో
ప్రియాకృతి
దారుణాఘు గణదారణంస్మ సగ్రాహయత్యపి సుదర్శన
ద్వయమ్ ౯—౩౯

(మధ్వాచార్యులు సజ్జనాదరణము, పాపజనాప్రియా కృతి యైన సుదర్శనద్వయమును గటాక్షించిరి. సుదర్శనద్వయ మపి గ్రాహయతిస్మ=సజ్జనులకు తప్తముద్రాంకమునిచ్చి శుద్ధులనుగావించిరి. సచ్ఛాస్త్రోపదేశము గావించిరి.)

మధ్వాచార్యుల కాశ్రమమొసంగినవారు అచ్యుత ప్రేక్షులు. గురువులు వేదవ్యాసులు. ఉడిపియందు అచ్యుత ప్రేక్షులసమక్షములో మధ్వాచార్యులుశిష్యులకు తప్తముద్రాధారణము గావించి పవిత్రులనుగావించి భాష్యప్రవచనమొనరించిరి.

మధ్వాచార్యులకు యతులు, గృహస్థులు, బ్రహ్మచారులు నానాజనులు శిష్యులుగలరు.

యతయో గృహిణోథ వర్ణముఖ్యాః శ్రుతిగా స్త్యక్త నిషిద్ధ
కామ్యభావాః

---

‡ అనుభూయతే సుఖ మనంతసఖైః సకలై రలం మతిపదం సతతమ్
అపి తారతమ్యసహితైః స్వగురుప్రవణైఃపరస్పరమురుప్రణయైః౧౧—౭౪

(తారతమ్యసహితము, స్వగురుప్రణవము, పరస్పరప్రణయము గల్గిన పరమాత్మభక్తులు, పూర్ణమైన మోక్షసుఖము ననుభవించువారగుదురు.)

లికుచవంశశేఖరులగు అచ్యుతప్రేక్షులు మధ్వాచార్యుల కాశ్రమ మొసంగెను. లికుచవంశశేఖరుడైన నారాయణపండితాచార్యులు మధ్వ విజయమును రచించెను. వేదవ్యాసశిష్యులగు మధ్వాచార్యులకు బిమ్మట వరిష్ఠసమ్మతులగు పద్మనాభతీర్థ ఉత్తరాదిమఠాధీశులై విలసిల్లిరి.

ఇహాముూర్తిధరా ఇవ స్వధర్మాః శతసంఖ్యా శ్శతసంఖ్య
మన్వగచ్ఛ్ణ ౧౩-౧౯

(యతులు, గృహస్థులు, బ్రహ్మచారులు, శతసంఖ్య గలవారు మధ్వశిష్యులుండిరి. వారందఱు వేదానుసరణము గల్గినవారు. నిషిద్ధకామ్యభావవర్జితులు. మూర్తీభవించిన స్వధర్మలు. వారందఱు మధ్వాచార్యుల ననుసరించి యుండిరి.)

మధ్వాచార్యులు ♦ ఉదయాస్తమానములందు ధ్యాన తత్పరులై యుండెడివారు. * పాఠప్రవచనమందే విశేష

---

♦ ఉదయతి వినతాయానందనే శ్లాఘ్యకాలే సకృతసకలకృత్యః కృత్యవేదిప్రవేకః
అరుణయవనికాంతర్బ్రహ్మనారాయణాఖ్యం గురుగుణమభిధ్యాయ యోగ్యయోగాసనస్థః ౧౪-౭

అరుణోదయమున కాలకృత్యములు దీర్చికొని యోగ్యయోగాసనస్థులై అరుణయవనికలోనుండి పరమాత్మను ధ్యానించిరి. (ప్రాతః కాల విషయము.)

ఏకం తత మతనుమనీషో చింతయ త్సత్సమాధా వసురసురనరేభ్యః
సద్గుణం నాథ మన్యమ్ ౧౪-౪౭

అంతటవ్యాప్తుడై భేదములేకుండు, సురాసురనరులకంటె భిన్నుడైనట్టి సద్గుణాధారుడైన పరంధాముని మధ్వాచార్యులు సత్సమాధియందు జింతించిరి. (సాయం కాలవిషయము.)

* 1 సూర్యోదయమునకు శిష్యులు (యతులు) అనుష్ఠానములు సత్వరము ముగించుకొని పాఠప్రవచనమునకువచ్చిరి. (సత్వరాః సత్త్వభాజః ద్రుత మవసితకృత్యై ర్దన్యసన్న్యాసిసంఘైః శ్రవణపరమకృత్యా యోపతస్థుః సమేతాః ౧౪-౧౫

ముగా ప్రొద్దు గడపుచుండెడివారు. వాదకుశలులు, పాఠ ప్రవచన తత్పరులునగు పద్మనాభతీర్థులు మధ్వాచార్యులకు

2 సూర్యుడు పడమరకు వచ్చువఱకు మధ్వాచార్యులు పాఠప్రవచనముగావించి యప్పుడు స్నానార్థము వచ్చువారు. (అథ దశశతశోచిష్యా ప్రియాతి ప్రతీచ్యాః ప్రవచన మవసాయ స్నాన మాయా త్తటాకమ్ ౧౪—౨౬)

3 దేవతార్చనము భోజనము ముగించుకొని మధ్వాచార్యులు ఉత్తమాసనమున గూర్చొని జనులకు దర్శనమిచ్చువారు–

తమరుణమణివర్ణం దివ్యదేహాఖ్యగేహే స్నపితమతి పృథుశ్రీద్ధానదీచిత్తవార్భిః

వను స యజతి నిత్యం హృత్సరోజాసనస్థం నతు సకృదితి పుష్పై రష్టభిర్భావపుష్పైః ౧౪–౩౬

మధ్వాచార్యులిట్లు పుష్పములతో నిత్యమొకసారి భగవదర్చన మొనర్చిరని యేమి. దేవదేహాఖ్యగృహమందు వారు సదా పృథుశ్రీద్ధగల్గి పరమాత్మ నభిషేకించువారైయున్నారు. అష్టభావపుష్పములతో నిత్యము భగవత్పూజ గావించువారై యున్నారుకదా।)

అనుచరపరిక్లప్తె సూక్ష్మవస్త్రాకృతే సావలితనుగహరూపాశీరవర్యే నిషణ్ణః

అరమయదిహ నానాహృద్యవిలాపైః కవిజనపరివారం మండయన్ మండపాగ్ర్యమ్ ౪౦

(అనుచరులు సూక్ష్మవస్త్రావృతముగా వృక్షాజినమును వేయగా నాయుత్తమాసనమున గూర్చొని మధ్వాచార్యులు మండపమును శోభింపజేయుచు విద్యావినోదమున కవిజనపరివారమును రమింపజేసెను_)

అల మల మనువాదే నానువాచ్యే తపశ్చా న్నను గురవ ఇదానీ మద్య తాహి ప్రవక్తుమ్

బిమ్మట పీఠాధిపతులైరి. పరమతఖండనపూర్వక స్వమత స్థాపన మొనరించిరి.

(1) ఆనందమాల (2) సన్న్యాయ రత్నావళి (3) సత్తత్త్వ రత్నావళి అను గ్రంథములను వీరు రచించిరి. ఆనెగొందిరాజు వీరి నెక్కువగా మన్నించియుండెను. హంపి వద్ద తుంగభద్రా తీరమందు నవబృందావన స్థలమున రక్తాక్షి సం॥ర కార్తీక బ॥ ౧౨ రోజున వీరు సిద్ధిపొందిరి.

---

న మనన మధునా ద్రాగా వ్రజే త్యాహ్వాయ త్తాం భుగ్రితపరిచయసక్తాన్
శ్రావకాం ప్రావకాగ్ర్యః ౪౪

("ఓసహస్రశ్రోతుడా! అనువాదము చాలుచాలు, అది పిమ్మట కానిమ్ము- ఇప్పుడు గురువులు ప్రవచనోద్యుక్తులగుచున్నారు. ఇపుడు మననము వలదు వేవేగరమ్ము' అని పాఠచింతన మొనర్చుచున్న శిష్యులను శ్రావ్యకాగ్ర్యుడొక డాహ్వానించెను.)

అధికధిషణమేనం వ్యాఖ్యయా శోభమానం హరిమివ కవివర్యం సత్యవత్యా
స్తనూజమ్
సతత మనిమిషం సందృశ్య సానందచిత్తాః సమయపి గతం సంవిదన్తే
న స్మ లోకాః ౧౪-౪౫

(వ్యాఖ్యాశోభితులగు మధ్వాచార్యులను జ్ఞానిశ్రేష్ఠులగు వేదవ్యాసునట్లు వారు సతతానిమిషులై చూచుచు నానందచిత్తులై ప్రొద్దుపోయినది గమనింపనేలేదు. మధ్వాచార్యులు సాయంసమాధిలో నుండగా శిష్యులగ్నిహోత్రాదికృత్యములు గావించిరి- ౫౦, ౫౧)

3. నరహరితీర్థులు. ౧౧౨౭-౩౬.

వీరి పూర్వాశ్రమ నామము శ్యామశాస్త్రి. వీరాంధ్ర దేశమున (కళింగరాజధానిలో) రాజప్రముఖులుగా నుండి యుండిరి. ఈ యాంధ్రప్రముఖుని శిలాశాసనములు శ్రీకూర్మము, సింహాచలము మున్నగు స్థలములందు గాన వచ్చుచున్నవి వీరివలన నాంధ్రదేశమం దంతటను ద్వైత మతము వ్యాపించినది.

(1) యమకభారత వ్యాఖ్యానము (2) దశోపనిషత్తులకు టీక (3) సూత్రభాష్య టీక మొదలగు గ్రంథములను వీరు రచించిరి. హంపి తుంగభద్రాతీరమందు చిత్రతీర్థ సమీపమున శ్రీముఖ పుష్య బ॥ ౭ రోజున వీరు సిద్ధిపొందిరి.

౪. మాధవతీర్థులు. ౧౧౩౬-౪౨.

వీరి పూర్వాశ్రమనామము విష్ణుశాస్త్రి. వీరును ఆంధ్రులే. వీరు ఋగ్యజుస్సామ వేదములకు వ్యాఖ్యానము రచించిరని ప్రసిద్ధిగలదు. 28 పదార్థములతో నొప్పియున్న పీఠమును వీ రారాధించిరన్న ప్రతీతి గలదు.

1. మూలరాములు, 2. మూలసీతాదేవి, 3. దిగ్విజయరాములు, 4-8. ఐదు వేదవ్యాసమూర్తులు, 9. లక్ష్మీనారాయణమూర్తి, 10. దధివామనమూర్తి, 11-15. ఐదు సుదర్శనములు, 16, 17. రెండుబాణములు, 18, 19. రెండు దక్షిణావర్తి శంఖములు, 20. హయగ్రీవమూర్తి, 21. శ్రీధర మూర్తి, 22. శ్రీరామవరహాలు, 23_27. ఐదు చక్రాం

కితసులు, 28. అక్షయపాత్రి. వీరు ఆనెగొందియందు వికృతి భాద్రపద బ॥ ౩౦రోజున సిద్ధిపొందిరి.

౫. అక్షోభ్యతీర్థులు. ౧౧౫౨-౬౭

వీరి పూర్వాశ్రిమ నామము గోవిందశాస్త్రి. 15 సంవత్సరములు ఉత్తరాది మఠాధిపతులుగా వీరు దేశసంచారముగావించిరి.

మధ్వతత్వసారసంగ్రహ మనుగ్రింథమును వీరు రచించియుండిరి. కాగిణీనదీతీరమునందు మళఖేడ యనుస్థలమున వీరు విశ్వావసు మార్గశీర్ష బ॥ ౫రోజున సిద్ధిపొందిరి.

౬. జయతీర్థులు. ౧౧౬౭-౯౦.

వీరి పూర్వాశ్రమ నామము ధోండోపంతు. తండ్రి పేరు రఘునాథరాయలు. తల్లి రకుమాబాయి. పండరీపుర సమీపమున మంగళవేఢె యను పల్లెగ్రామము వీరి జన్మస్థానము. వీరికి 13వ సంవత్సరమున వివాహమాయెను.

అధికారి బిడ్డయగు పంతు ఒకప్పుడు తనపరివారముతోడ బయలుదేరి మార్గమున వచ్చుచుండ నతనికి దాహము విపరీతముగా వేయుచుండెను. అపుడతడు భీమనది వైపునకు వేగ నశ్వమును మరలించి తానొక్కడే నదిని సమీపించెను, గుఱ్ఱముమీదనుండియే నీరు త్రాగుచుండిన పంతునుగాంచి అక్షోభ్యతీర్థు లాశ్చర్యచకితులై తమసన్నిధికి పంతును పిలిపించుకొనిరి. "శ్రీరాముని కరుణ నీపై గలిగినది, ఆశ్రిమ స్వీకార మొనర్పు" మని సెలవిచ్చిరి. అదేరాత్రి ఆశ్రిమ

స్వీకార ప్రోత్సాహకమగు స్వప్నమును గాంచి, తరుణ వయస్కుడగు పంతు శ్రీవారి యాజ్ఞానుసార మాశ్రమమును స్వీకరించెను.

పంతు పరివార మీ పరిణామమునకు విచిత్రమొంది యాతని తలిదండ్రుల కీయుదంత మెఱింగించిరి. తలిదండ్రులు పుత్రవ్యామోహపీడితులై బెంగలూని యతివరుని వద్దకు వేగవచ్చి "మాకూన నట్లానర్చుట పాటికాదు. లేవయసు వాడు, సుకుమారుడు" అని మాటాడుచు నాకురవ్రానిని బలాత్కారముగ గృహమునకు మరలించుకొనివచ్చిరి.

అది సంపన్న శోభనగృహము. సౌందర్యరాశి, సర్వాభరణభూషిత, తరుణి రామాభాయి ఏకాంతగృహమున ప్రాణవల్లభుని దిలకించి పరమాశ్చర్య మొందినది. ఆదిశేషునియట్లు వెలుగొందుచున్న నిజనాథుని గాంచినది. వీర పత్నివిశిష్టమైన, విలక్షణమైనకీర్తి తనయందు ప్రతిష్ఠింపబడుట కా యిల్లాలు నమోవాకములర్పించినది. శోభన గృహమునుండి వెలువడిన ఆ యతివరుడు, ఆ బాలసన్యాసి తలిదండ్రులయొక్కయు, నర్ధాంగియొక్కయు నామోదము నొందినవాడగుచు మరల నక్షోభ్యతీర్థుల సన్నిధికి వచ్చెను. తమకుమారుని స్వయమా తల్లిదండ్రులు గురువర్యున కప్పగించి, రామదేవుని తీర్థప్రసాదముల గైకొని, తప్తముద్రాధారణమొంది ధన్యులైరి. శ్రీరాముని కరుణచేతను, గురువరుల కృపాదృష్టిచేతను, బాలయోగి యోగ్యవచనమువల

నను నా పుణ్యదంపతులకు వంశోద్ధారకుడగు పుత్రు డొక్క డావిమ్మట నుద్భవించెను.

ఆశ్రమ నామము జయతీర్థులు. వీరనేక గ్రంథములు రచించిరి. 1. తత్త్వప్రకాశిక, (మధ్వాచార్యుల బ్రహ్మసూత్రము 2000 గ్రంథమునకు 8000 టీకా గ్రంథము.) 2. సుధ (అను వ్యాఖ్యానము 4000 గ్రంథమునకు 28000 టీకా గ్రంథము.) 3. న్యాయవివరణము (మూల గ్రంథటీక 2 పాద.) 4. ప్రమేయదీపిక (గీతాభాష్య టీక ) 5. న్యాయదీపిక (గీతా తాత్పర్యటీక.) 6. తత్త్వసంఖ్యాన టీక. 7. తత్త్వవివేక టీక. 8. ఉపాధిఖండన టీక. 9. మాయావాద ఖండన టీక. 10. మిథ్యాత్వానుమానఖండన టీక. 11. తత్త్వనిర్ణయ టీక. 12. కథాలక్షణ టీక. 13. తత్త్వోద్యోత టీక. 14. కర్మనిర్ణయ టీక. 15. షట్ప్రశ్నభాష్యటీక. 16. ఈశావాస్యభాష్య టీక. 17. ఋగ్భాష్యటీక 18. న్యాయకల్పతరు (ప్రమాణలక్షణటీక.) భారతమున పదునెనిమిది పర్వములు విలసిల్లినట్లువీరు మధ్వాచార్య గ్రంథములకు పదునెనిమిది టీకాగ్రంథములు రచించినారు. వీరు మరికొన్నిగ్రంథములు కూడరచించినారు. 1. ప్రమాణపద్ధతి(ప్రమాణలక్షణములు.) 2. వాదావలి (అద్వైతఖండనపూర్వక హరిసర్వోత్తమత్వ ప్రతిపాదకమగు గ్రంథము.) 3. శతాపరాధస్తోత్రము (భగవన్నుతి.) 4. పద్యమాల (దేవతార్చనవిధి.) 5. అధ్యాత్మామృత తరంగిణి (వేదాంతప్రమేయ సంగ్రహము.) 23 వత్స

రము ఉత్తరాది మఠాధిపతులుగ నున్న వీరు 23 గ్రంథ రాజముల రచించి వన్నెకెక్కిరి.

మధ్వాచార్యులందు "భాష్యకారులు" అనునామము సార్థకమైయున్నటుల నీజయతీర్థులందు "టీకాచార్యులు" అను నామము సార్థకమైయున్నది. మధ్వమతమునకు వీరొనర్చినసేవ నిరుపమానమైనది. "పఠించిన సుధాగ్రంథ పఠనము, పాలించిన సర్వవసుధాపాలనము" అను నానుడి వీరి సుధాగ్రంథమున కేర్పడినది. సుధామంగళాచరణమే ద్వైతమతమున పరమావధిగా శోభించుచున్నది. అట్టి యుత్కృష్ట గ్రంథ మీజగాన వెలయించిన పరమ ధన్యజీవులీ టీకాకృత్పాదులు. "పఙ్త్కి రచనలో వీ రసమానులు" అను ప్రఖ్యాతి యేర్పడినది. పరమ ప్రశాంతస్థలమున గూర్చొని శిష్యులు గొనివచ్చు భిక్షాన్న మొకేప్రొద్దు భుజించుచు, సదాగ్రంథ నిమగ్నులై సర్వకాలము నిట్లుగా గడపిన పరమ సాధుచారిత్రు లీయోగివర్యులైయున్నారు.

అద్వైతమతమున నద్వితీయులు విద్యారణ్యులు, విశిష్టాద్వైత మతమున నద్వితీయులు వేదాంత దేశికాచార్యులు. వీరుభయులు జయతీర్థ సమకాలీనులై యున్నారు. ద్వైతాద్వైత విశిష్టాద్వైతములందు వీరివలె నపారమైన కృషిగావించినవారు మఱిలేరు. అందు జయతీర్థుల యశశ్చంద్రిక జగమందలి నిర్మలమై ప్రకాశించుచున్నది.

ఇట్లుగా వీరు సుధారూపములగు గ్రంథములను ప్రచార మొనర్చి తమ ౪౨ సం॥రమున కాగిణీ నదీతీర

మందు మళఖేడ యను గ్రామమున విభవ ఆషాఢ బ॥౫
రోజున సిద్ధిపొందిరి.

టీకాచార్యులవారి గ్రంథములవలన మధ్వాచార్యుల గ్రంథము లవగాహనమగుచున్నవి. మధ్వాచార్యులకాలమందు జగద్విఖ్యాత పండితులుగా నున్న త్రివిక్రమపండితాచార్యులు రచించిన వాయుస్తుతివలన మధ్వమహిమ యవగాహన మగుచున్నది. త్రివిక్రమ పండితాచార్య పుత్రులు నారాయణపండితాచార్యులు రచించిన మధ్వవిజయ గ్రంథమున మధ్వాచార్యుల సమగ్రచరిత్ర యవగాహన మగుచున్నది. "పండితాచార్య" అను బిరుద మీతండ్రికొడుకుల విషయమై విఖ్యాతిగా నొప్పియున్నది. టీకాచార్యులవారికి వ్యాసతీర్థులను శిష్యులొకరు గలరు. వీరు శా॥ శ॥ ౧౨౦౦ ప్రాంతమువారని తెలియవచ్చుచున్నది. (1) తలవకారోపనిషత్తు (2) అథర్వోపనిషత్తు (3) తైత్తిరీయోపనిషత్తు (4) బృహదారణ్యోపనిషత్తు (5) కాఠకోపనిషత్తు (6) మాండూక్యోపనిషత్తు (7) ఐతరేయోపనిషత్తు (8) చాందోగ్యోపనిషత్తు వీటిపై మధ్వభాష్యములకు వీరు టీకలు రచించిరి. (9) జయతీర్థవిజయ మను గ్రంథమునుగూడ వీరు రచించిరి.

౭. విద్యాధిరాజతీర్థులు. ౧౧౯౦-౧౨౫౪.

వీరి పూర్వాశ్రమ నామము కృష్ణభట్టు. మత ప్రచారము దెక్కువ శ్రద్ధవహించిన వీరు తమవద్దనున్న రాజేం

దుగ్రిలను, మహాపండితుల నిందుకొఱకై నియమించిరి. స్వాములవారివద్ద సన్న్యాసము స్వీకరించిన రాజేంద్రులు దేశ సంచారము గావించుచుండగా విద్యాధీశు లస్వస్థులయిరి. అపుడిం కొకరికి ఆశ్రమ మొసంగవలసిన యవసర మేర్పడి నది. అంగీరస వైశాఖ శుద్ధ 3 రోజున సిద్ధిపొందిరి. పూర్వము వీరివలన సన్న్యాస మొందియున్న రాజేంద్రు లీవృత్తాంతము లెఱిగి ఉత్తరాది మఠమునుండి విడిపోయిరి. ఆ భిన్నమైన త్రోవయే నేడు వ్యాసరాయమఠముగా నేర్పడినది.

౮. కవీంద్రతీర్థులు. ౧౨౫౮–౬౧.

వీరి పూర్వాశ్రమ నామము వాసుదేవశాస్త్రి. విద్యాధిరాజతీర్థులవలన యవసానకాలమున నాశ్రమ స్వీకార మొనర్చిన వీరుపీఠాధిపతులుగా నేర్పడిరి. వీరు ప్రణవ జపత పాదినిత్యానుష్ఠాన తత్పరులను ప్రసిద్ధిగలదు. కఠిననియమా వళిననుసరించి యవి సాగించుచుండిరి. పాఠప్రవచనము, దేశ యాత్ర సాగించుచు వీరు ఆనెగుందివద్ద ప్రమాది చైత్రశుద్ధ ౯ రోజున సిద్ధిపొందిరి.

౯. వాగీశతీర్థులు. ౧౨౬౧–౬౯.

వీరి పూర్వాశ్రమ నామము రఘునాథాచార్యులు. వీరును తమ గురువులమాదిరి నిత్యానుష్ఠాన పాఠప్రవచన దేశయాత్రలను సక్రమముగా సాగించుచు, ఆనెగుందివద్ద సర్వజిత్తు చైత్ర బహుళ 3 రోజున సిద్ధిపొందిరి.

౧౦ రామచంద్రతీర్థులు. ౧౨౬౯-౯౮.

వీరి పూర్వాశ్రమ నామము మాధవశాస్త్రి. భివలూరు రామచంద్రతీర్థులనియు వీరిని పేరొక్కనుట కలదు. వీరు మతవ్యాప్తికై అనేక దేశములు సంచారము చేసియున్నారు. శ్రీరంగమున కాశీనాథుడను మహాపండితునితో వీరికి వాద మేర్పడినది. ౨౮ దినములు స్వాములవారఖండముగా సుధాగ్రంథసారము నుపన్యసించి ఘనప్రశంసనొందిరి. ఒకప్పుడు వీరికి దేహాయాస మేర్పడగా నొకరికి సన్యాస మొసంగిరి. అటుపైని స్వాములవారు స్వస్థతనొందిరి. సన్యాస మొందిన యా విబుధేంద్రులకు టీకాకృత్పాద పూజితమైన జయరామ ప్రతిమను, కొన్నిసాలగ్రామములను నొసంగి స్వాములవారు వారి నుత్తరదేశ సంచారమునకు బంపిరి. తిరల దేహాయాసమగుటను విబుధేంద్రులకు కబురంపిరి గాని దూరదేశమం దుండిపోయినందున వారు సకాలమునకు వచ్చుటకు సావకాశమైనది కాదు. అందుచేత నింకొకరికి ఆశ్రమ మొసంగుచు విబుధేంద్రులరాకకు నిరీక్షింపవలసినదిగా దెల్పి పీఠ విగ్రహములను వీరి కైవస మొనర్చిరి. నల సం॥ర వైశాఖ శుద్ధ ౭ రోజున యరగోళ యనుస్థలమున స్వాములవారు సిద్ధిపొందిరి.

౧౧. విద్యానిధితీర్థులు. ౧౨౯౮-౧౩౬౬.

వీరి పూర్వాశ్రమ నామము కృష్ణాచార్యులు. గురువుల యాజ్ఞానుసారము విబుధేంద్రులరాకకై యాఱుమాస

ములవఱకు వీరు నిరీక్షించియుండిరి. ఆ యరగోళ గ్రామమం దలి ధర్మన్న మొదలగు పెద్దలు విద్యానిధులనే మఠాధిపతులు కావలసినదిగా గోరిరి. పీఠాధిదైవము (మూలసీతారామ విగ్రహములు) వీరికే లభించియున్నందున దైవనిర్ణయమట్లే యేర్పడి విద్యానిధులే మఠాధిపతులయిరి అంత నావిబుధేంద్రు లేతెంచి జరిగిన యుదంతము విని వారపు డుత్తరాది మఠమునుండి విడిపోయిరి. అభిన్నమైన కోవయే రాఘవేంద్రమఠముగా నేర్పడినది.

విద్యానిధులు సింహాచల నృసింహు నారాధించియున్నారు. వీరనేక స్థలములు సంచారము గావించియున్నారు. ఆనెగుంది రాజువలన మన్నన నొందిరి. రాయచూరు జిల్లాలో నా రాజిచ్చిన బహుమతి నేటికిని మఠమున నిలిచియున్నది. వీరు రక్తాక్షి కార్తీక బ॥ ౪ రోజున సిద్ధిపొందిరి.

౧౨ రఘునాథతీర్థులు. ౧౩౯౯-౧౪౨౪.

వీరి పూర్వాశ్రమనామము విష్ణుశాస్త్రి. వీరు గొప్ప విష్ణుభక్తులని ప్రసిద్ధిగలదు. వీరి వైరాగ్యసంపద దొడ్డది. మూలసీతారామ విగ్రహములుగల పెట్టెను వీరు స్వయము ధరించుచు, శిష్యులు దివిటీలుపట్టి వచ్చుచుండగా కాలి నడకను ప్రయాణము చేయుచుండెడివారు.

ఒకప్పుడు పేజావర మఠస్వాములు విజయధ్వజతీర్థులను వారు క్షుద్బాధ దుర్భరముగాగ స్వపచనమున భుజించుట తటస్థించినది. ఆ యాశ్రమధర్మ వ్యతిరేక ప్రవర్తన పరిహా

ర్థము భాగవత సప్తాహము గావింపవలసినదనియు, భాగవతమునకు వ్యాఖ్యాన మొనర్పవలసినదనియు రఘునాథ తీర్థులు సూచింపగా వారట్లొనర్చి నస్లైతిహ్యము గలదు. "విజయధ్వజీయ"మను నా గ్రంథము బహుప్రచారముగా విలసిల్లుచున్నది. మళఖేడ గ్రామమున దుందుభి సం॥ర మార్గశీర్ష బహుళ ౧ రోజున స్వాములవారు సిద్ధిపొందిరి.

౧౨. రఘువర్యతీర్థులు. ౧౪౨౪-౭౯.

వీరి పూర్వాశ్రమ నామము రామచంద్రశాస్త్రి. వీరి కాలమున ద్వైతమతప్రచారము విరివిరిగా జరిగినది. అనేకులు శిష్యులైరి. ఆనెగుందివద్ద పింగళ జ్యేష్ఠ బ॥ 3 రోజున సిద్ధిపొందిరి.

౧౪. రఘూత్తమతీర్థులు. ౧౪౭౯-౧౫౯౭.

వీరి పూర్వాశ్రమనామము రామచంద్రాచార్యులు. రఘువర్యులవలన చిన్నతనముననే వీరు ఆశ్రమస్వీకార మొనర్చిరి. గురువుల యాజ్ఞననుసరించి మఠము ముఖ్యశిష్యులన దగు వరదాచార్యులవద్ద శాస్త్రాధ్యయన మొనరించిరి. గురుస్థాన మధిష్ఠించియు వీరు శాస్త్రాధ్యయన కాలమందు శిష్యవటుగా బ్రవర్తించుచువచ్చిరి. "స్వాములవారు తనకుశిష్యులైరి" అని ఇంచుక గర్వించియున్న సమయమున స్వాములవారు తమపాండిత్యప్రభావము ప్రకాశముగావించి యాచార్యులవారికి దిగ్భ్రమగల్గించిరి. మఱియు వారిని మన్నించి మఠమునందే యుంచికొనిరి.

ఛత్రి చామరాది వైభవము, (చిక్క) చిన్ననైవే ద్యము, మహానైవేద్యము అనువ్యవస్థ వీరికాలమునుండియే యేర్పడెను. ప్రభువుల రాక యట్లుగా నది మొదలు ఉత్తరాది మఠాధిపతుల రాక యొప్పినది, వీ రనేక గ్రంథములు రచించిరి.

(1) భావబోధి [తత్వప్రకాశ టిప్పణి] (2) బ్రహ్మ ప్రకాశిక [బృహదారణ్యభాష్యటీక] (3) బ్రహ్మప్రకాశిక [న్యాయవివరణటీక] (4) ప్రమేయదీపిక. ఈ గ్రంథములన్ని టికీ "బావబోధ" అను నామము వీరుంచినందున వీరికి "భావబోధకారులు" యను ప్రసిద్ధి యేర్పడినది. దక్షిణపినా కినీ తీరమందున్న తిరకోలు యనుగ్రామమున మన్మథ పుష్య బ॥ ౧౧ రోజున వీరు సిద్ధిపొందిరి.

౧౫. వేదవ్యాసతీర్థులు. ౧౫౧౭–౪౧.

పిల్లూారు అను వంశమున కొన్నేరభట్టు అను గొప్ప విద్వాంసులు ప్రసిద్ధులై యుండిరి. వీరు వేదవ్యాసోపాసకులు. వీరికి నలుగురు కుమారులుండిరి. అందొకపుత్రున కిష్టదైవము పేరు పెట్టుకొనిరి. ఆ పుత్రుడు పూర్వపుణ్యవశమున మంచి తపశ్శాలిగా నేర్పడెను. భావబోధకారులని ప్రసిద్ధిజెందిన రఘూత్తమతీర్థుల గ్రంథములను వీరు కంఠస్థమొనర్చుకొని శిష్యుల కవిపాఠములు చెప్పుచుండిరి. ఇదిగాంచి యారఘూ త్తమతీర్థులు కడుమోదమంది వీరిచేతనే అందలి అధికరణము లకు టిప్పణి వ్రాయించిరి. మఱియు వీరిచేత మూలసీతా

రాముల ఆరాధనము నడిపింపగోరి జయ సం॥ర వైశాఖ శు॥ ౧౫ రోజున వీరికి యత్యాశ్రమమొసంగి మఠపూజ గావింప జేయుచుండిరి. ఇట్లుగా నీయిరువురు స్వాములు సీతారాముల నర్చించుచువచ్చిరి. గురువులు సిద్ధిపొందిన పిమ్మట వీరనేక స్థలములు సంచార మొనర్చుచు మతప్రచార మొనరించిరి.

వీ రనేకులకు సన్యాస మొసంగిరి. అందు మొదట సన్యాస మొందిన నారాయణయతి, మళిగి తిమ్మన్నభట్టు వీరిద్దఱును గొందఱిని శిష్యులుగా వెంటగొని రాయచూరుకు జేరి, యచ్చటి గృహస్థులవలన భిక్షలను గొనుచు, "మూల రామదేవుని ప్రతిమ యిది" అని తనువద్దనున్న ప్రతిమను గృహస్థులకు జూపింపదొడంగిరి. అపు డక్కడనున్న ఉత్తరాది మఠాధికారి (మఠప్రతినిధి) యీ సమాచారమును పెనగుండియందున్న స్వాములవారికి తెలియజేయగా వారు నారాయణయతిని బహిష్కరించుచు నాజ్ఞాపత్రమును బంపిరి. అది రాయచూరు ప్రముఖుల యెదుట నా మఠాధికారిచే బహిర్గత మొనరింపబడినది.

స్వాములవారు కుంభకోణమునకు వచ్చినపుడు ఛించోళి కృష్ణద్వైపాయనాచార్యులకు సన్యాసమొసంగి వారివలన కొన్నిదినములు సంస్థానపూజ గావింపజేసిరి. పిమ్మట వారికి దిగ్విజయరామ ప్రతిమ నొసంగి సంచారార్థము పంపిరి. వారట్లుగా దేశసంచార మొనర్చి పిమ్మట నా విగ్రహమును మరల గురువులకు సమర్పించిరి. స్వాములవారి

యనుగ్రహమున కొన్నినాళ్ళు సంస్థానపూజ గావింపదొడం గిరి. పీఠమందున్న రత్నఖచిత వేదవ్యాస ప్రతిమను దీసి కొని తత్స్థానమున వేఱొక ప్రతిమ నుంచివేయవలెనని యొకబుద్ధి యీ కృష్ణద్వైపాయనాచార్యులకు గల్గినది. తన వద్దనున్న వేదవ్యాస ప్రతిమకు ప్రాణప్రతిష్ఠాదులను గావించి పరమాత్మ సన్నిధానముగల్గు వైదిక ప్రక్రియ నంతయు గొప్పనిష్ఠగా జరిపి యీ ప్రతిమను పీఠమందునిచి యా రత్నఖచిత పీఠస్థవిగ్రహమును దీసివేసిరి. కాని స్వాముల వారివద్ద సెలవుగైకొను నవసరమున నప్రయత్నముగ వీరికి కంట నీరు గారెను. సంస్థానమూర్తియున్న పెట్టెను స్వాముల వారి ముందుంచి సాష్టాంగముగావించి తమ యపరాధమును క్షమింపవలసినదని వేడుకొనిరి. కృష్ణద్వైపాయను లుంచి యున్న కృష్ణశిలాప్రతిమనుగూడ స్వాములవారు పీఠమం దుంచి పూజింపదొడంగిరి. వీరికి ప్రత్యేకముగ ప్రసన్నవిఠల, వంశరామ మున్నగు విగ్రహములను దయచేసిరి. ఆ విగ్రహ ముల నారాధించుకొనుచు వీరు దేశయాత్రకు వెడలిపోయిరి.

ఒకప్పుడు సుధీంద్రతీర్థులను సన్యాసి యిట్లొక వార్త గల్గించెను.

"అన్యై రపహృతాం మూలమూర్తిం శ్రీరఘునందనమ్
ఆజహార మహామూల్యాత్ శ్రీ సుధీంద్ర గురోర్గురుః॥"

[అన్యులచే నపహరింపబడిన మూలరామ విగ్రహ మును సధీంద్రుల గురువుల గురువులు హెచ్చుధనమిచ్చి కొనియుండిరి.]

వెంకటపతిరాజు అనువారివద్ద నీతగువుపడినది. తన్ని ర్ణయార్థ ముడుపీ మఠస్థులగు వాదిరాజస్వామి లిందు దఖలు పుచ్చుకొనవలసినదిగా గోరబడిరి. వారీవివాదమును బరిష్కరించుచు, ముఫ్వురిపేర మూఁడుమాటలు ప్రత్యేక ప్రత్యేకముగ బంపియుండిరను ఐతిహ్యముగలదు. రాజునకు : ఉత్తరాది మఠమునందున్న విగ్రహమునకే అసలైన లక్షణము లున్నవి. వేదవ్యాసతీర్థులకు: మాణిక్యఖండమందున్నది మాణిక్యము గాక యింకేమగును ? సుధీంద్రులకు : స్వామి ద్రోహము కూడని పని. దీనివలన మీకు వచ్చు ఘనత యేమియులేదు. ముందిట్టివి గావింపవలదు.

వెంకటపతిరాజు స్వాములవారిని విశేషముగా సత్కరించెను. స్వాములవారు ఢిల్లీసుల్తాను మన్నన నందినట్లు, శ్రీరంగరాజు వీరిని హెచ్చుగా సత్కరించునట్లును వినికిడి గలదు. ఈ రాజు హిరేమరళి, చిక్కమరళి యనుగ్రామము లొసంగినట్లు, హేమావతీనదీతీరమందు నరసింహాపుర మను క్షేత్రమున పీఠమున కొక మఠమును గట్టించి యిచ్చెననియు, ననేక వస్తువాహనముల నర్పించెననియు వినికిడి కలదు. రడ్డిహాల్లి, దొడ్డఘట్టి మొదలగు గ్రామములు సంస్థానమునకు వీరికాలమున సమర్పితములైనవి. స్వాములవారు మార్కండేయ నదీతీరమున సిద్ధార్థిచైత్ర శు॥ ౨ రోజున సిద్ధిపొందిరి.

### ౧౬. విద్యాధీశతీర్థులు. ౧౫౪౧—౫౩.

వీరి గురువులనేకులకు సన్యాస మొసంగియుండిరి. వా రెవరి కిని పీఠాధిపత్యము లభించలేదు. పాండురంగి నరసింహాచార్యులు అనువా రొకప్పుడు స్వాములవారి సందర్శనమునకు రాగా దైవనిర్ణయమున స్వాములవారికి వీరియందు కటాక్షము గల్గినది. విద్యాధీశతీర్థు లని నామముంచి వీరిని పీఠాధిపతులుగా నిర్ణయించిరి. గురువుల సమక్షముననే వీరు కొన్ని దినములు పీఠాధిదేవత నుపాసించుచుండిరి. గురువులు సిద్ధి పొందిన పిమ్మట గుర్వారాధనము విశేషముగ నొనర్చి మహాసమారాధన మొనర్చిరి. విద్వత్సంభావన లొసంగిరి. పిమ్మట సుధామంగళ మాచరించిరి.

వీరి గురువుల పూర్వాశ్రమమందలి అన్నగారగు వ్యాసప్పాచార్యులద్వారా మహీసూరు మహారాజు నరస రాజువద్దనుండి స్వాములవారికి ఆహ్వానము వచ్చెను. మహారాజుచే పెక్కుసత్కారముల నొంది (1) చిణ్య (2) వృత్తి (3) సన్నచిక్కూరు అను గ్రామములను సంస్థానమునకు బహుమతిగా బడసిరి. ఆ సంస్థానప్రదేశమున లభ్యమైన ప్రాణదేవుని విగ్రహమును వీరు కావేరీతీరమందు శ్రీరంగ పట్టణ సమీపముననున్న చందగురు గ్రామమున ప్రతిష్ఠ గావించిరి, దాని పూజరాగాదుల నిమిత్తము మహారాజు వలన లభ్యమైనట్టి నాగమంగళం తాలూకాకు సంబంధించిన చిణ్య గ్రామమందలి అర్ధభాగము దానపట్టాగా నొసంగిరి.

౧౭ బ్రాహ్మణ కుటుంబముల కింగువలన వృత్తి కల్పింప బడినది. వ్యాసప్రాచార్యులకు "కట్టెపురాణ" మను నధికారము నొసంగిరి. (మఠస్థులు సమాగమమైనప్పుడు పురాణ పఠనాధికారగ మీ యధికారము హొందినవారి కుండును.) మఱియు రాఘవేంద్రతీర్థులవారు రచించిన "సుధాపరిమళ" మను గ్రంథమును దిలకించి, యట్టి యుత్కృష్ట గ్రంథమును రచించినందులకు వారిని విశేషముగ గొనియాడిరి. ఛత్రపతి మహారాజువలన ద్రోణజ, శిరద్రోణజ యను రెండుగ్రామములను సంపాదించిరి.

ఒకప్పుడు వీరు గయాక్షేత్రమునకురాగా నచట గయావళులు "విశేష ధన మొసంగిన గాని మఠశిష్యులు గయాశ్రాద్ధములు జరిగింప వలనుపడదు" అని పలుక జొచ్చిరి. అదిగాంచి స్వాములవారు శిష్యులతో "పీఠస్థ దిగ్విజయరామ విగ్రహ సమీపమున మీ రందఱు పిండప్రదానాదికములు జరిగింపుడు. ఇది "రామగయ" అని సెలవిచ్చిరి. మూడురోజులకు బిమ్మట గయావళులు స్వాములవారి మహిమకు నాశ్చర్యచకితులై వారిపాదములకు సాష్టాంగ మొనర్చి మఠశిష్యులయిరి. అది మొదలు గయావళు లందఱు ఉత్తరాది మఠ శిష్యులయిరి. నేటికిని వారు ఉత్తరాది మఠ శిష్యులుగా నున్నారు. గయావళుల మఠ శిష్యులయిన పిమ్మట స్వాములవారు మఠ శిష్యు లందఱిచేత విష్ణుపాదమున శ్రాద్ధముల నొనర్ప ననుజ్ఞనిడిరి. శిష్యులందఱు నట్లు గావించిరి.

వీరు (1) విష్ణుతత్త్వనిర్ణయ టిప్పణి (2) ఏకాదశీ నిర్ణయము (3) విష్ణుపంచకోపవాసనిర్ణయము (4) వ్యాఖ్యార్థ చంద్రిక [సుధాగ్రంథమందలి ౫ అధికరణములకుటిప్పణి] (5) ద్విత్వవాదార్థము (6) తలవకారోపనిషత్ ఖండార్థము (7) ఓంకారవాదార్థము (8) తిథిత్రయ నిర్ణయ అను గ్రంథ ములను రచించిరి. బదరీ మొదలగు యాత్రలను ముగించు కొని వీరు ప్రజోత్పత్తి పుష్య బహుళ ౧౪ రోజున సిద్ధి పొందిరి.

౧౭. వేదనిధితీర్థులు ౧౫౫౩-౫౭.

విద్యాధీశస్వాములవారొకప్పుడు ప్రయాగక్షేత్రము నకు వచ్చి అచ్చటనున్న ఘన దీక్షాదక్షులగు కోరటిగి ప్రద్యుమ్నాచార్యులను మహావిద్వాంసులను గాంచిరి. ఆచా ర్యులు మహావిరాగులై, అష్టాక్షరీమంత్రనిష్ఠాపరులై, నిరాహారు లగుచు నియమమూచరించుచుండుటనుగాంచివిద్యాధీశతీర్థులు పరితుష్టినొందిరి. ఆచార్యులనుగూడ తోడ్కొనిపోయి సం చార మొనరించుచుండిరి. ఒకప్పుడు విద్యాధీశతీర్థులు గంగా తీరమందున్న వాల్మీకియాశ్రమమున సంచరించుచుండగా నాచార్యులవారికి పీఠాధిపత్య మొసంగ దైవప్రేరణ మైనది. వెంటనే తమ యభిప్రాయమును ఆచార్యులవారికి దెల్పి, ఆశ్రమ మొసంగి పీఠాధిపతుల నొనర్చిరి.

విద్యాధీశస్వాములవారు బదరికాశ్రమమునకు బోవు నపుడు పీఠమునుండి దిగ్విజయరామ విగ్రహమును బూజి

చుచు యాత్రి సాగించుచుండిరి. విద్యాధీశులతోగూడ మఠ శిష్యులనేకులు యాత్రార్థము బయలుదేరిరి. వేదనిధితీర్థుల పూర్వాశ్రమమందలి అన్నగారి పుత్రులు రంగాచార్యుల వారుగూడ నా యాత్రియందుండిరి. విద్యాధీశస్వాముల వారు సిద్ధిపొందిన పిమ్మట అచ్చట నాచరింపవలసిన కృత్యములన్నియు వీరు తీర్చి యా దిగ్విజయరామ విగ్రహము మున్నగునవి గొని తెచ్చి పీఠమునకు మరల సమర్పించిరి. వేదనిధితీర్థులవారి మహిమ కానందమొంది త్రిచనాపల్లి నవాబు మఠమునకు మంచాకొప్ప జిల్లాయందలి మూడు గ్రామముల కానుకగా నొసంగియుండెను. స్వాములవారు మహదానంద భరితులై కుంభకోణము, శ్రీరంగము, మధుర మున్నగు స్థలములందున్న అనేక విద్వాంసులను రప్పించి గురువుల వారి యారాధనను గొప్పగా నెఱవేర్చి, ఆవిద్వాంసులను సువర్ణాదులచే దనివినొందించిరి. వీరిమహిమను విని ఆనంద మొంది రాఘవేంద్రస్వాములవారు కొన్నినాళ్ళు సంచారమున వీరి ననుసరించియుండిరి.

శ్రీముష్ణ గ్రామవాసులగు రామచంద్రతీర్థులను యతు లొకరు స్వాములవారి కొకవిషయమై అవసరమగు తొందరను గలిగించగా తంజావూరు రాజిందు దఖలుపుచ్చుకొనుటను గాంచి యా రామచంద్రతీర్థులు రాత్రికిరాత్రి పలాయన మొందిపోయిరి.

వేదవ్యాసతీర్థులవలన (౧౫ స్వాములవారు) సన్యాస మొంది వారికి అనుగ్రహపాత్రులై యుండిన కృష్ణద్వైపాయ

నులవారి చేటీ స్వాములవారి కేర్పడెను. "విద్యానాథతీర్థులు" అని పేరుగల వారియొక్క శాస్త్రవిచారమును, పాండిత్య విశేషమును దిలకించి స్వాములవారు వారికి "రంగనాథతీర్థులు" యను నింకొక బిరుద నామము నుంచిరి. పండరీపురమున యువ సంవత్సర కార్తికశుద్ధ ౧౧ రోజున స్వాములవారు సిద్ధిపొందిరి.

౧౮. సత్యవ్రత తీర్థులు. ౧౫౫౭—౬౦.

విద్యాధీశ స్వాములవారికి యిద్దఱిపై గాఢాభిమాన ముండియుండెను. అందు కోరటిగి ప్రద్యుమ్నాచార్యుల వారు వారి తర్వాత వేదనిధితీర్థులను నామమున పీఠాధిపతు లయిరి. రెండవవారు కోరటిగి రంగనాథాచార్యులవారు. విద్యాధీశ స్వాములవారు బదరికాశ్రమ యాత్రనుండి మరలునపుడు అవసానకాలమున పీఠస్థ దిగ్విజయరామ విగ్రహమును వీరిపరముగా పీఠమునకు జేర్చువారగుచు "ముందు పీఠాధిపత్యము నీకు సంక్రమింప గల" దని ఆశీర్వదించి యుండిరి. వేదనిధి తీర్థులకు పూర్వాశ్రమమున అన్నగారి పుత్రులై యున్న యోగ్యులగు నీ రంగనాథాచార్యులవారు పరమగురువుల ఆశీర్వాద బలమున, గురువుల అనుగ్రహ విశేషమున పీఠాధిపతులుగా నేర్పడిరి. వేదవ్యాసతీర్థులవారి యనుగ్రహమునకు పాత్రులై వారివలన సన్యాసము స్వీకరించియున్న కృష్ణద్వైపాయనాచార్యులవారికి నమస్కరించి వారి యనుగ్రహము, ఆమోద మొందినవారగుచు పీఠాధిపత్యము వహించిరి. వీరు కర్ణాటక దేశమంత టెక్కువగా సం

చారము గావించి గురువుల యాజ్ఞానుసారము కొలగి. రఘు పత్యాచార్య లనువారికి పీఠాధిపత్య మొసంగి సాంగలిగ సమీపమున బహుధాన్య సం॥ ఫాల్గుణ శుద్ధ ౬ రోజున సిద్ధి పొందిరి.

౧౯. సత్యనిధితీర్థులు. ౧౫౬౦—౭౨.

కుమారుల ఉపనయనార్థము వీరు-కాశీ క్షేత్రమునకు వెళ్లియున్నందున సత్యవ్రతుల యనంతరమందు గుర్వనుగ్రహమున వీరు పీఠము నధిష్ఠించిన వారైరి. మూల సీతారామ విగ్రహముల నిమిత్త మేర్పడియున్న విభేదము వీరి కాలమున తీరిపోయినది. వీరి కాలమున తిండివనము అనుస్థలమున ౮ దినములు గొప్ప విద్వత్సభ జరిగెను. వ్యాసతీర్థులు, రంగనాథతీర్థులు,మునీంద్రతీర్థులులక్ష్మీకాంతతీర్థులు మున్నగు ప్రముఖులు సభనలంకరించి శాస్త్రార్థమొనర్చిరి. ఆ సభయందు రంగనాథతీర్థులవారి ప్రతిభ విశేషముగ బ్రకటితమాయెను. వేదవ్యాసతీర్థుల కాలమునుండి ఉత్తరాది పీఠమునకుసంబంధించినవారుగా నున్న కృష్ణద్వైపాయన స్వాములవారి సమక్షమున స్వాములవారు సచ్ఛాస్త్ర శ్రవణాదులను గొంత కాలము జరిపిరి.

వీరిరువురకు సన్యాస మొసంగిరి. (1) సత్యానంద తీర్థులు (2) గుణనిధితీర్థులు. నివృత్తిసంగమమును కృష్ణాతీరస్థ స్థలమున శార్వరి సం॥ మార్గశీర్ష శుద్ధ ౧౦ రోజున స్వాములవారు సిద్ధిపొందిరి.

## ౨౦. సత్యనాథతీర్థులు. ౧౬౪౮—౭౪.

వీరి పూర్వాశ్రమ నామము రఘునాథాచార్యులు. వీరికి విద్యానాథు లనియు, రంగనాథతీర్థు లనియు రెండు నామము లిదివర కేర్పడియున్నది. వీరు వ్యాసతీర్థు లను వారిని గొప్పగా గౌరవించియుండిరి. వ్యాసరాయ మఠము నకు జెందిన లక్ష్మీనారాయణతీర్థు లనువారివలన "అమఠ మున మూలసీతారామ, వేదవ్యాస ప్రతిమలు లేవనియు, ముద్రాధారణము గావించు యధికారము లేదనియు" నొక పత్రమును వ్రాయించుకొనిరి. ఆ పత్రము నేటికిని ఉత్తరాది మఠమునందు భద్రముగా నున్నది. వేదవ్యాసతీర్థుల కాలము నుండియు భీష్మలట్లు ఉత్తరాది మఠమునకు సంబంధించి యున్న కృష్ణద్వైపాయనతీర్థులవారు తనవద్దనున్న పూజాప్రతి మల నన్నిటిని వీరి కొసంగి అనుగ్రహించి సుదర్శన చక్రాం కితములను వీరివలన స్వీకరించి స్వాములవారి మాహాత్మ్య మును తమశిష్యులకు బ్రకటించిరి. పిమ్మట కృష్ణద్వైపాయన తీర్థులు కుసుమావర్తి అనుస్థలమునకు వెడలి యచ్చట జ్యేష్ఠ శుద్ధ ౧౬ రోజున సిద్ధిపొందిరి. చలారి నరసింహాచార్య లను పండితులు స్వాములవారిని వాదముఖమున బాల్గొని నిరుత్త రులై యది మొదలుకొని స్వాములవారి పాదసేవ గావిం చుచు వారు మఠమునందే యుండిరి.

(1) కర్మనిర్ణయటిప్పణి (2) విజయమాల (3) అభి నవచంద్రిక (4) అభినవామృతము (5) అభినవగద (6) పర

శువు అను గ్రంథములను స్వాములవారు రచియించిరి. ప్రమాది సం॥ర మార్గశీర్ష శుద్ధ ౧౧ రోజున అరుణాచల క్షేత్రమున సిద్ధిపొందిరి.

౨౧. సత్యాభినవతీర్థులు. ౧౫౯౫—౧౬౨౮

వీరి పూర్వాశ్రమ నామము కేశవాచార్యులు. వీరి కాలమున ఉత్తరాది సంస్థానమున నిత్యక్రమమను పద్ధతి యేర్పడి యది యిప్పటికిని సాగుచున్నది. వివిధమైన సేవలకుగాను ౬౭ మంది బ్రాహ్మణులు నియమింపబడిరి. వీ రందఱిపైన ముఖ్యులుగా ముఖ్యపారుపత్యగారు నియమింపబడిరి. ఎడ బల సేవకులు (ఇరువైపులనుండు సేవకులు), ఇద్దఱు సేనాపతులు, ద్వారపాలకులు మున్నగు వ్యవస్థ యేర్పడెను. రూపాలంకారములు, సువర్ణ రజతోపకరణములు, స్వర్ణమయము రత్నఖచితమునగు ఛత్రచామరములు, నేతి దీపములు, గుఱ్ఱములు, ఏనుగులు, ఆవులు మున్నగునవి సంస్థానమున నియమితమైనవి.

(1) ఆమంత్రణోత్సవము (2) గురుపాదార్చనము (3) పంచాంగశ్రవణము (4) కాలకాల స్నానము (5) జపము (6) వ్యాఖ్యానము (7) నిర్మాల్య విసర్జనము (8) వేదవ్యాసులకు నవరత్నాభిషేకము (9) కూర్మమూర్తికి [సాలగ్రామమునకు] క్షీరాభిషేకము, (10) దేవతార్చన సమయమున వేదపారాయణము (11) సప్తమాలార్పణము (12) చిన్న అలంకారము, మహానైవేద్యము (13) నైవేద్య సమయమున

యవనిక నుంచుట (14) బంగారపు గిన్నెలో పంచదార నైవేద్యము (15) పానీయ తాంబూలాది సమర్పణము దేవవ్యాసాది ప్రతిమలకు కనకాభిషేకము. ఇట్టి క్రమపద్ధతి యేర్పడినది. అర్చనానంతరము మూలసీతారామ విగ్రహములు, వేదవ్యాసాది ప్రతిమలు సభకు గనబఱచుట, తీర్థ వినియోగము, మహాసమారాధనము [స్వాములవారి సహపంక్తి], మధ్యాహ్నము శాస్త్రవిచారము, సాయంకాలము నృత్యగీతవాద్య పురస్కృతముగ శ్రీహరిని రత్నఖచితమైన ఉయ్యాలయందుంచి సేవజేయుట, సభికులకు మంత్రాక్షత మాలా ప్రసాదముల నొసంగుట, చివర నారోజు ఆయవ్యయ విచారము. ఈరీతిగా దినక్రియ పద్ధతి యానాటినుండి యేర్పడినది.

ఒకప్పుడు ఢిల్లీ నేలుచుండిన ఔరంగజేబువలన సంస్థానమునకు తొందర యేర్పడు పరిస్థితి యేర్పడెను. నారో భాస్కరుడనువాని యిలాలు సావిత్రిభాయి యను సతీమణి దీని నుపాయాంతరమున తప్పించినదను వాకబొకటి గలదు. కావేరీతీరమున నాచారిగుడి యనుస్థలమున వ్యయనామ సం॥ర జ్యేష్ఠ శుద్ధ ౧౧రోజున వీరు సిద్ధిపొందిరి.

౨౨. సత్యపూర్ణతీర్థులు. ౧౬౭౮-౮౮.

వీరి పూర్వాశ్రమనామము కొల్హాపుర కృష్ణాచార్యులు. కృష్ణాజీపంతు యనుభక్తు డతిభక్తితో స్వాములవారి పాద పూజ గావించెను. అది మొదలుకొని యాతడంతకంతకు

వృద్ధినొందిన వాడగుచు చివరకు మంత్రిపదవి నధిష్ఠించిన వాడాయెను. మంత్రియైనపిమ్మట మగల స్వాములవారిని సత్కరించి మఠమున కనేక స్వర్ణాభరణములు, పచ్చలు, రత్నములు, మణుగుతూకముగల బంగారపు సరవళి యీతడొసంగెను. అవన్నియు నేటికిని నీతనిపేర మఠమున కానవగుచున్నవి.

ఒకప్పుడు స్వాములవారు తిరుపతియాత్ర జేయరాగా గార్లవాడ రామాచార్యులను నొకశిష్యులు వెంకటాచలము నధిరోహించుచు సుధాగ్రంథమును పఠింప మొదలిరి. కొండ నెక్కుసరికి ౨౪,౦౦౦ గ్రంథము క్రమముతప్పక వారుపఠించిరి. కూడివచ్చుచున్న స్వాములవారి శిష్యులదిగాంచి పరమాశ్చర్యమొందిరి. భగవదనుగ్రహమున వీరు స్వాముల వారివలన సన్యాసాశ్రమమొంది "సత్యప్రియు" అనునామము ధరించిరి. సంస్థానమునుండి కొన్నిపరికరములనుగొని వీరుదేశ సంచారమునకు వెడలిపోయిరి. పిమ్మట స్వాములవారు దేశ సంచారమునకు బయలువెడలి కృష్ణాతీరమున కోలపురమను స్థలమున పరాభవసం॥ర జ్యేష్ఠబహుళ ౨రోజున సిద్ధిపొందిరి.

౨౩. సత్యవిజయతీర్థులు. ౧౬౪౮-౯౯.

వీరి పూర్వాశ్రమనామము బాళాచార్యులు. వీరు సంచారము గావించుచు ఆరణిస్థలమునకు రాగా నచ్చటి రాజు స్వాములవారిని విశేషముగసత్కరించి కొన్నిగ్రామము లొసంగెను. కొంతకాలము స్వాములవా రచ్చటనే రామ

పూజ గావించుచుండిరి. సంస్థానమును సత్యపూర్ణతీర్థులవలన (శ్రీశివ స్వాములవారిచే) నాశ్రమమొందియున్న సత్యప్రి యుల కొప్పగించ వలసినదని యీ రాజుతో దెల్పి స్వాముల వారు కౌండిన్యనదీతీరమున పింగళ సంవత్సర చైత్ర బ॥ ౧౧ రోజున సిద్ధిపొందిరి. ఆస్థలము నేడు సత్యవిజయ మను నగర ముగా నొప్పియున్నది.

౨౮. సత్యప్రియతీర్థులు. ౧౬౯౫—౬౬.

వీరి పూర్వాశ్రమనామము గార్లపాడ రామాచా చార్యులు. సత్యపూర్ణతీర్థులవలన నాశ్రమస్వీకార మొనరిం చిరి. సత్యవిజయతీర్థులకు బిమ్మట వీరు సంస్థానాధీశులయిరి. దక్షిణాధీశుని సైన్యమున ప్రముఖులగు వినాజీపంతు, సాఠో పంతు అను నిరువురు స్వాములవారిని నెక్కువగా మన్నిం చిరి. మొదటి బాజీరాయులు రామనగర మను గ్రామము నొసంగి సత్కరించెను. రాయచూరునందు ఫత్తేసింగు అను సరదారుడు వీరియందు గొప్పగా భయభక్తులు ప్రకటించెను. మేలుకోట ప్రభువు బహుద్రవ్య మొసంగి సత్కరించెను. అచ్చటనున్న శ్రీ నృసింహమూర్తిని స్వాములవారు దర్శిం చిరి. శ్రీరంగరాజు వీరిని సత్కరించి శ్వేతఛత్రము, రత్న సంపుటము, వెండిబంగారపు దుడ్లు మఠమున కొసంగెను. గద్వాలుమీదుగా పడరణమునకు స్వాములవారు రాగా నచ్చోటికి కర్ణాటకనవాబుయొక్క మంత్రి కృష్ణాజీపంతు స్వాములవారికి కనకాభిషేక మొనర్చుట, అనేక కానుకల

నొసంగుట గావించెను. మురారిరాయలను నతడు స్వాముల వారి సేవ ఘనముగా గావించెను. వెనుక రాయచూరునందు స్వాములవారియందు గొప్పగా భయాభక్తులు ప్రకటించి యున్న పత్తేసింగు సరదారుడు యుద్ధవిజయమొందినవాడై యా యానందమున మరల స్వాములవారి సేవ యుత్సాహమున గావించెను. వాని సైనికులెల్లరు స్వాములవారి నారాధించిరి. ఆతని రాజు ౬ గ్రామములొసంగెను. పత్తే సింగు ౨ గ్రామము లొసంగెను.

శ్రీరంగమున నొక వ్యాకరణ విద్వాంసులతో స్వాములవారికి వాదమేర్పడియుండెను వీరి కాలమున పాండు రంగి ఆచార్యులను ఘన విద్వాంసు లొకరు మఠమునం దుండిరి. స్వాములవారు వేదవతీ నదీతీరమందుండు మానా మధురతో రక్తాక్షి సంవత్సర చైత్ర శుద్ధ ౧౩ రోజున సిద్ధి పొందిరి.

౨౯. సత్యబోధ తీర్థులు. ౧౬౬౬—౧౭౦౯

రాయచూరు హరియాచార్యులను నొక పేదవిప్రుడు కుటుంబ సహితముగ నుత్తరాదిమఠమున వసించుచుండిరి. ఇతని కుమారులలో రామాచార్యులను కుజ్జువాడు బహు యోగ్యుడై యుండెను ఆ కుజ్జువాని సత్ప్రవర్తనమునకు స్వాములవారు సంతసమొంది యాదరింపజొచ్చిరి. పాండు రంగియాచార్యులు మున్నగు ఘన విద్వాంసులు యీ కుజ్జు వాని నియమనిష్ఠల కబ్బురమంధిన వారగుచుండిరి. స్వాముల

వా రవసానమున నీ కుజ్జవానికి ఫలమంత్రాక్షత లొసంగి, హస్తమును శిరమున నునిచి "మఠము మాహాత్మ్యము వెల యింపుము, జ్ఞానివగుము" అని ఆశీర్వదించి, "సత్యబోధ" అను నామ ముంచిరి. గురువుల యాదర మొందియున్న పాం డురంగి ఆచార్యులు సంస్థానము తమకు దఖలుపడలేదని కించె నొందుట నీ సత్యబోధులు కనిపెట్టి వారిని యోగ్యముగ సత్కరించి, కొందఱ శిష్యుల నొసంగి, పల్లకి యొకటిచ్చి, విశేషధన మొసంగి, "సౌఖ్య మొనగూడును" అని ఆశీర్వ దించి పంపిరి.

స్వాములవారినిగుఱించి యనేకములయిన గాథలు వెల సినవి; ఒకానొక మాంత్రికుని కుతంత్రమును వీరరికట్టిరనియు ఒకానొక రాజు ఉత్తరాది సంస్థానమందలి విపులవైభవమును విని యీర్ష్యనొందగా దమ మహిమావిశేషమున (సత్యాగ్రహమున) పూర్వ పూర్వ రాజుల ఉదారత్యాగ సంపదను దట్ట జేసి వారిని సరిజేసిరనియు, ఒకప్పుడు గయావళులుశఠించి యుండ వారిని సరిదిద్ది వారిచే విష్ణుపాదము నిండుగా వరహాలతో పూజగావింపజేసి, యది పారితోషికముగా వారివలన గైకొనిరనియు, ఒకానొక స్థలమునకు భాగీరథీ సాన్నిధ్యమును గల్గించిరనియు, నదిమొదలా క్షేత్రము విష్ణుతీర్థమని ప్రసిద్ధి నొందిన దనియు, కపి జన్మనొందిన ఘనవిద్వాంసు నొక్కని నుద్ధరించిరనియు, రామచంద్రాచార్యులను వారికి ఆయు ర్వృద్ధవకర్మ యాచరించి యుద్ధరించిరనియు వీరినిగుఱించి

పెక్కు విశేషములు చెప్పుచున్నారు. వెనుకటి స్వాములవారి కాలమునందువలెనే పాఠప్రవచనాదుల బలము వీరిపట్ల కానరాదని యాదిలో గొందఱు లేవదీసిన యపవాద మిందువలన పరాస్తమైనది.

జానోజీ నింభాళకుడను సరదారుడు, తంజావూరు రాజు, కృష్ణాజీపంతు, సవణూరురాజు, దివానుఖుండేరాయులు మున్నగువారు స్వాములవారిని విశేషముగ గౌరవించిరి. ఒక నవాబు ఊరుమధ్యమున నొక విశాల ప్రదేశమును, వరదా తీరమందలి మెళ్లెగట్టి అను గ్రామము నొసంగెను.

కుంభకోణమున స్వాములవారు విశాలమగు మంటపము నొకటి నిర్మించిరి. కాశిలో దుర్గా ఘట్టమున ఒక మఠము స్థాపించిరి. అచ్చట ఒక లక్ష బ్రాహ్మణసమారాధనము గావించిరి. సవణూరునం దొక మఠమును గట్టించి యందు బహుకాలముండిరి. అక్కడనుండగా నొకనాడు కొందఱేకమై పరమాన్నమున విషముకలిపి నైవేద్యమిడిరి. నైవేద్యమైన పిమ్మట యాకపటము బయల్పడెను. ఐనను దైవనివేదనమును విడువక భుజించి, దాని విరుగుడుకై వైద్య సహాయ మొందిరి. తచ్ఛాంత్యర్థము స్వాములవారు కొన్ని నాళ్ళు అపరరాత్రియందు పూజ, భోజనము గావింపవలసి వచ్చినది. అది దిలకించి రామశాస్త్రి మున్నగువారు "స్వాములవారు అర్థరాత్రి పూజ, అపరాత్రి భోజనము గావించుచున్నా"రని యపవాదు వేసిరి. "పరమాత్మ సన్నిహితత్వ

మా కాలమందు గల్గియున్న”దని కొన్ని నిదర్శనములు ప్రక టించి అపవాదు బాపికొనిరి. విషభక్షణ దోషమప్పటికి శాంతించినందున నదిమొదలు లానిశిరాత్రి చర్యమానివేసి రనియు నొకవార్త వీరిపట్లగలదు. తంజావూరునందలి సేతు గోసావి యను పండితులతో స్వాములవారికి శాస్త్రార్థవాద మైనది. సవణూరునందు శోభన సం॥న ఫాల్గుణ బహుళ ౧ రోజున సిద్ధిపొందిరి.

౨౯. సత్యసంధతీర్థులు. ౧౭౦౫—౧౯.

వీరి పూర్వాశ్రమ నామము హోవేరి రామచంద్రా చార్యులు. వీరి గురువు లొకేచోట బహుదినము లుండిపోయి యున్నందున వీరు సంచారమునకు బయలుదేరిరి. సత్య బోధులందువలెనే వీరివిషయమునగూడ పెక్కు మహిమలు వర్ణింపబడియున్నవి. పాండురంగని దర్శనము వీరికి యైన దనియు, గయాసమీపమున నిర్జనప్రదేశమున నొకనాడు దేవ పూజార్థము పుష్పములు లేక చింతించినపుడు సహస్రపత్రి కమల మొకటి దైవకృపచే వీరికి లభించినదనియు, గయ యందు, కాశియందు వీరి మహిమ యెక్కువగా ప్రసిద్ధమైన దనియు వాకబుగలదు.

మదారిసులో తిరువళ్ళికేణియందు వీరు ప్రాణమూ ర్తిని ప్రతిష్ఠచేసిరి. ఉడిపికివెళ్ళి మూలసీతారామ, వేదవ్యాస విగ్రహములను రథమున నూరేగించి అష్టమఠ స్వాములాదర పూర్వకముగా మన్నించుచుండగా శ్రీకృష్ణపూజను గావిం

చిరి. ౧౨,౦౦౦ రూపాయలు ఉడిపి శ్రీకృష్ణమూర్తికి సమర్పించిరి. అష్టమఠములందు ఉత్తరాదిసంస్థానము పూజను గావించిరి. అప్పుడష్టమఠ స్వాములవారు యథాయోగ్యముగ స్వాములవారిని సత్కరించిరి.

వీరు జ్ఞానపూర్వకముగ తమ అంత్యప్రక్రియ గావించుకొనిరనియు, యోగమార్గమున బ్రహ్మరంధ్రము భేదించగా సిద్ధిపొందిరనియు బ్రసిద్ధిగలదు. "అన్ని మఠములవారు పరస్పరము సహకారముగావించుకొనుచు మొత్తము మధ్వమతము నుద్ధారముగావింపుడు" అని వీరు తుదిమాటలు పలుకుచు మతస్థులకు తమ సందేశమును వివిపించిరి. విష్ణుసహస్రనామములకు వీరు టీక రచించిరి. తుంగాతీరమున అశ్వత్థనారాయణ సన్నిధానమున ఆనందనామ సంవత్సర జ్యేష్ఠశుద్ధ ౨ రోజున సిద్ధిపొందిరి.

౨౭. సత్యవతీతీర్థులు ౧౭౧౬—౧౯.

వీరి పూర్వాశ్రమ నామము హావేరి కృష్ణాచార్యులు. వెనుకటి స్వాములవారికి వీరు శిష్యులు. వీరుత్తరాది మఠమునసుండియే విద్య నభ్యసించి, తద్యాస్థాన పండితులనిపించుకొనిరి. పల్లకీమర్యాద వీరికేర్పడినది. తిరుపతి శేషాచార్యులవద్దవ్యాకరణమీమాంసావ్యాసంగమొనర్చిరి. న్యాయవేదాంత విచారము గురుస్వాములవారి సమక్షమునజాయెను.

స్వాములవారు సవణూరు ప్రాంతమునకు వచ్చిరి. అక్కడ నాలుమాసములు వసించి యుండిరి. అలవణాహారముగ ౨౮ లక్షలు ప్రణవజపము గావించిరి. గురుస్వాములు

రచించియున్న సహస్రనామ టిప్పణియొక్క ప్రచారమును గావించిరి. శ్రీరామ వేదవ్యాస విగ్రహములకు కోటితులస్యార్చనము గావించి లక్ష బ్రాహ్మణ సంతర్పణము గావించిరి. పిమ్మట తిరుపతికి వేంచేసి ౬, ౭ దినము లక్కడనుండి శ్రీనివాస పూజ గావించిరి. అచ్చట నాలుగు ప్రతిమలకు మంత్రోద్ధారము గావించి నలుగురు ఉత్తమ బ్రాహ్మణుల కవి యొసంగిరి. పిమ్మట అనంతపురము మీదుగ తులాకావేరీ స్నానము గావింప శ్రీరంగపట్టణమునకు బయలుదేరిరి.

టిప్పుసుల్తానువలన దేశమున కొంత యలజడి ఆ కాలమున గలిగినది. అదిగాంచి ఝులిపి కృష్ణాచార్యులను వారిని శ్రీరంగమున మంత్రిశ్రేష్ఠులుగా నుండిన పూర్ణయ్యగారివద్దకుబంపిరి. వారియూతను సంస్థానమున స్వస్థత యేర్పడెను. పూర్ణయ్యగారు తీర్థ శ్రీనివాసాచార్యులు, సంజీవ కృష్ణాచార్యులు, హరి దాసాచార్యులు, తామ్రపర్ణి ఆచార్యులు యను నలుగురు పండితులను దీసికొని మఠమునకు వచ్చిరి. "మంచిదినములు వచ్చునలకు రామనాథపుర మందుండవలసినదనియు, పిమ్మట తనముండి క్షేత్రమున నుండ వలసినదనియు, సంస్థానముయొక్క విలువైన ఆభరణాదులగు వైభవమంతయు సంతెబినున్నారున. దున్న పూర్ణయ్యమంత్రుల అన్నగారి పుత్రులగు హిరణ్యప్ప యనువారి పరమున సురక్షితముగ నుంచవలసినదనియు నాలోచనము గావించిరి. ౧౦ మంది జనమును, ౪ ఆచార్యులవారిని, పారుపత్యాచా

ర్యులవారిని, శానభోగ శ్యామా చార్యులవారిని స్వాముల రక్ష ణార్థము నియోగించిరి. ఆ సంతెబిన్నూరునం దున్న తమ గృహమును పూర్ణయ్యగారు సంస్థానమునకు కృష్ణార్పణముగా సమర్పించిరి. పూర్ణయ్యగారి అన్నగారి పుత్రులు స్వాముల వారం దుండుటకు తగిన ఇమ్ములన్నియు గావించిరి. తురు ష్కుల భయమున నుత్తరదేశ సంచారమునుండి బుద్ధి మరలిం చుకొని కొలది పరివారముతో స్వాములవా రాసంతెబిన్నూరు నందే కొద్దిపాటి ఖర్చువెచ్చములతో కాలక్షేపము గావించు చుండిరి. ఇట్లుండగా పుద్వావర్తి రాఘవాచార్యుడను నీచు డొకడు పెద్దసంకటమును దెచ్చిపెట్టెను. స్వాములవారు యేమరుపాటు నొందియుండగా నెదుట నుంచబడియున్న మూలరామదేవుని పెట్టెనెత్తుకొని పాఱిపోయెను. స్వాముల వారిది తెలిసి వేదవ్యాస పూజమాత్రమే నాడు గావించి తీర్థమును బుచ్చుకొని, యదిమొద లుపవసింప నారంభించిరి. మంత్రివర్యులగు పూర్ణయ్యగారు దొంగను కనుగొనుటకయి యనేక ప్రయత్నములు గావించిరి. అనుమాన మున్నవారిపై కఠినచర్య తీసికొనిరి. ఇదిగాంచి తస్కరుడగు రాఘవాచా ర్యుడు భయమొంది ఒక నూతివద్ద ఆకులమధ్యగా నావిగ్ర హమును విడిచి పాఱిపోయెను. నాటికి స్వాములవారి కిరువది యొకటవ యుపవాస దినమైనది. ఆ నాడు సవణూరు ప్రాంత మువారగు మతపండితులైన నవరత్న అణ్ణయాచార్యులను వారు దైవవశమున నచ్చోటుకు వచ్చుట తటస్థించినది.

హారచ్చటనున్న రామవిగ్రహమును దటాలునగాంచి యానందమున పరుగులిడుచు బోయి స్వాములవారి కీ శుభవార్త నివేదించిరి. స్వాములవారు తమ నిస్సత్తువను లక్ష్యముచేయకుండ గుభాలున లేచిపోయి విగ్రహమున్న స్థలమునకు వచ్చి రామమూర్తిని హృదయస్థలమందు నిలుపుకొని కన్నీరుచే నభిషేక మొనర్చిరి. మూర్ఛబోయిరి. మంగళవాద్య పురస్సరముగ నా రామవిగ్రహమును గొనిపోయి గొప్పయుత్సవమును, మహాసమారాధనము గావించిరి.

౨౧ దినములు కఠినోపవాసములు గావించినందున స్వాములవారు నీరసస్థితికి వచ్చిరి. అందుచేత విగ్రహమును గనిపెట్టిన నవరత్న అణ్ణయాచార్యులవారే పీఠాధిపత్యము వహింప నర్హులని దలంచి స్వాములవారు పింగళనామ సం॥ర శ్రావణ శుద్ధ ౫ రోజున యాచార్యులవారికి ఆశ్రమ స్వీకార మొనర్చి పీఠాధిపతుల గావించిరి. స్వాములవారు సంతె బిన్నూరునందు పింగళనామ సంవత్సర శుద్ధ ౭ రోజున సిద్ధి పొందిరి.

### ౨౮. సత్యధర్మతీర్థులు. ౧౭౧౯-౫౨.

పూర్వాశ్రమమున నున్నపుడు వీరు పేదఱికమున మిక్కిలి బాధనొందిరి. పీఠాధిపత్యమును వహించిన పిమ్మట గురు పుత్రులగు హావేరి స్వామియాచార్యులకు చక్కని యుపాధిని గల్పించిరి. తమకు పూర్వాశ్రమములో కుమారులగు నవరత్న బోధరాయాచార్యులను మఠమునందే నిలుపు

కొని స్వాములవా రతనికి స్వయముగా పాదప్రిచనాదులు గావించుచుండిరి. అప్పటికి పేష్వాలసందడి కొంత తగ్గి నందువలన సంస్థాన సకల వైభవములను దీసికొని తగుమాత్రమగు సిబ్బంది నుంచుకొని వీరు దేశాటనమునకు బయలుదేరిరి.

రాజా నారాయణరాయలను ధనవంతుల మూలమున హైదరాబాదు నవాబు మన్నన లొందిరి. లింగపల్లియందొకమఠమును స్థాపించిరి. పిమ్మట రాజమహేంద్రవరమునకు వచ్చిరి. పారుపత్య ఆచారప్పాచార్యులు; కల్లాపుర రామచంద్రాచార్యులు అనువారివలన స్వాములవారి వైభవమును వినునట్టి విజయనగర సంస్థానాధీశ్వరు లా యుత్తరాది సంస్థానాధీశ్వరులను తమసంస్థానమున కత్యంతము వైభవముగా నాహ్వానించిరి. విజయనగర మంత్రివర్యులు మంగళవాద్య పురస్కృతముగ శ్రీవారి నెదుర్కొని గొనిపోయిరి. ఒక నెలరోజులు మహారాజులు శ్రీపాదుల కాతిథ్య మొసంగిరి. ముత్యాలహారము, నవరత్నఖచిత పీఠప్రభలు, ఆభరణ మంటపము నొసంగిరి. బాజీరాయులు (మహారాష్ట్రులు) తన అష్టప్రధానపరివారమును వెంటగొనివచ్చి స్వాములవారిని గౌరవపురస్సరముగ నాహ్వానించెను. ఒక నెలరోజులాతిథ్య మొసంగెను. లక్షవరహాలు, మకరకంఠము, ముత్యాల వైజయంతీమాల, రెండు మణుగుల బంగారముతో చేయబడిన యొక మంటపము, అంబారీలతోడ నాలుగు యేనుగులు

తాశీ గుఱ్ఱములు బహుమతిగా నొసంగెను. మఠ పండితులకు ఆశ్రితులకు బహుమానము లొసంగెను. శ్రీపాద పుత్రులకు బంగారుహారము, చెవి ముత్తెము, శిరోలంకారము మున్నగు వేడ్కలు గావించెను. స్వాములవారీ రీతిని బహుమానములు బడయుచు ౧౨ సంవత్సరములు దక్షిణాది యాత్రలు సాగించిరి. కొల్లాపురమురాజు స్వాములవారిని విశేషముగా సత్కరించెను. కోటయందే స్వాములవారికి బస యేర్పఱచి, నెల రోజు లాతిథ్య మొసంగెను. పదివేల లక్ష్మీవరహాలు, నవరత్న కలశములతోడనున్న బంగారుపల్లకీ, రత్నాభరణములు, వెండి బంగారముల అలంకారముతోగూడిన అంబారీలుగల రెండుయేనుగులు, వివిధములయిన సువర్ణ పాత్రలు స్వాములవారికి కానుకగా నొసంగెను. స్వాములవారు కొల్లాపురము మహాలక్ష్మికి లక్షకుంకుమార్చన మత్యంత వైభవముగా గావించిరి. ౧౦౮ సాలంకృతములగు మూసివాయనము దానములు గావించిరి.

వీరి కాలమున శాస్త్రవాదములు జరిగినవి. హైదరాబాదు, కళింగదేశము (విజయనగర ప్రాంతము), మహారాష్ట్రములం దనేకులు ద్వైతమతమును స్వీకరించిరి. కర్జగి యను స్థలమున విరూపాక్షమఠ పండితులొకరు మధ్వమతమును దూషించుచు ''కవి మహిమ'' అను గ్రంథమును ప్రచారము చేయుచుండుట స్వాములవారికి తెలియవచ్చెను. స్వాములవా

రక్కడికి వెళ్ళి సభను జరిపిరి. ఆ సభ యొనిమిది దినములు జరిగెను.

౧. "అభినవగద" యను గ్రంథము "కవి మహిమ" యను గ్రంథమును ఖండించినది.

౨. విజయీంద్ర స్వాములవారు రచియించిన "అప్పయ్య గల్ల చపేటిక" అను గ్రంథము "మధ్వతంత్ర ముఖ మర్దనము" అను గ్రంథమును ఖండించినది.

3. సత్యనాథతీర్థులు రచించిన యీ "అభినవగద" అను గ్రంథమువలన అప్పయ్యదీక్షితుల గ్రంథము ఖండింపబడినది. ఈ రీతిగా నా సభయొక్క ఫలితములు తేలినవి.

ఆంధ్రదేశమున, మహారాష్ట్రదేశమున ప్రభువుల సన్మానములు మహీసూరు మంత్రి పూర్ణయ్యగారి పలుకుబడివలన నేర్పడిన దనవచ్చును. ఆ పూర్ణయ్యగారు మహీసూరు రాష్ట్రమునకు స్వాములవారి నాహ్వానించుచు నిట్లు వార్త పంపిరి, "వెనుకటి ఉత్తరాదిమఠ స్వాములు వేదవ్యాసతీర్థులు మహారాజులందు దయజూపియున్నారు. అట్లే మీరును దయజూపదగినది. మతత్రియ గురుస్థానములు, మతత్రియ పీఠములు, మతత్రియ విద్వాంసులు తమ సంస్థానమున నుండవలయునని మహారాజుల మన్నన, శ్రీవారు హాళే నరసింహాపురమందు నివసింపవచ్చు" నని వర్తమాన మంపిరి. స్వాములవా రందుల కంగీకరించి విచ్చేసిరి. ౨౦ వేల వర

హోల నొసంగుచు ఢంకానౌబతు మున్నగు మర్యాదల మంత్రి పూర్ణయ్యగారు ఉత్తరాదిమఠమునకొచ్చిరి. స్వాములవారక్కడనుండగా నొకమారు మహాసమారాధన కాలమునకు గొప్ప వర్షాటంకముగలిగెను. అదిగాంచిన పూర్ణయ్యగారు ౧౨ వేల బ్రాహ్మణులకు సరిపోవు మఠము నొకటి కట్టించి యిచ్చిరి. ఇంకొక్క వత్సరముగూడ ఉత్తరాది సంస్థాన మచ్చటనే యుండుటకు, మఠము ఖర్చువెచ్చములన్నియు మహీసూరు సంస్థానము భరించుటకు పూర్ణయ్యమంత్రి తేర్పాటు గావించిరి. మఠమందలి ప్రతియొక్కరికి ఆ సంవత్సరమునకు వర్షాశన మేర్పాటు గావించిరి. ఇట్లుగా నుత్తరాది మఠమునకమూల్యమగు సేవగావించిన యోగ్యులగు పూర్ణయ్యగారు స్వాములవారి పాదసేవజేయుచు, శ్రీ మధ్వాచార్యుల వారి ౩౭ గ్రంథములను చక్కగా వ్యాసంగ మొనర్చి మంగళ మాచరించిరి. ఆసమయమున శ్రీపాదపుత్రులకు, కాశీ తిమ్మణ్ణాచార్యులు, కౌలిగ బాళాచార్యులు, గార్లవాడ కృష్ణాచార్యులు, కల్లాపురపు రామచంద్రాచార్యులు, హైదరాబాదు అనంతాచార్యులు, బెంగళూరు దాసాచార్యులు, ఉడిపీ వాసుదేవాచార్యులు, హాసకోటి గోవిందాచార్యులు మున్నగు పండితులకు గొప్పసత్కారములు గావింపబడినవి. స్వాములవా రాసంస్థామందుండునపుడే మహీసూరునందు వరాహమూర్తి ప్రతిష్ఠ యొకటి జరిగెను. ప్రభవ సంవత్సరమున నరసింహదేవుని సన్నిధిలో పూర్ణయ్యగారు సోమయాగ

మొకటి గావించిరి. స్వాములవారి సమక్షమున నిట్టి శుభకా ర్యము లనేకములు జరిగినవి. మహారాజులకు ఫల మంత్రా క్షత లీయబడినవి.

స్వాములవారు పూర్ణయ్యగారి మర్యాదలవలన చాలా కాల మిట్లుగా నరసింహాపురమునందే యుండిరి. ౧౬ పర్యా యములు సుధామంగళము లాచరించిరి. సత్యసంధతీర్థుల(౨౬) కాలమున నాస్థానపండితులుగా నుండిన తిరుపతి బాళాచార్యు లచే రచింపబడియున్న షట్శాస్త్ర క్రోడ పత్రములనురఘులిపి కృష్ణాచార్యు లనువారిచే చదివించి స్వాములవారు స్వయము వినుచుండిరి. తాము రచించిన గ్రంథముల కనువాదములను గూడ వారిచే జేయించుచుండిరి. సభలు జరిపి విద్వాంసుల సత్కరించుచుండిరి. ఇంత పూర్ణయ్యగారు దివాణ పదవి నుండి విరమించు సమయ మేర్పడినది. అపుడు వారు మహీ సూరు సంస్థానమునుండి మఠమునకు సమర్పితములైన అన్ని వస్తువులపైన కృష్ణరాజ ఒడయుల విలాసములను వేయించిరి. ఆఖరు సేవగా భాండారమునుండి ౨౦ వేల వరహాలు తెప్పించి స్వాములవారికి సమర్పించిరి. అనేక బ్రాహ్మణులకు వృత్తులు కల్పించిరి. స్వాములవారికి సాష్టాంగము గావించి వారు పదవీ విరమణమొంది శ్రీరంగపట్టణమునకు వెడలి పోయిరి.

ఒకప్పుడు మఠమునకు అగ్నిప్రమాదము ఘోరముగ సంభవించినది. ఆభి శ్రీనివాసాచార్యులు, రఘులిపి కృష్ణా

చార్యులు, ఆచారప్పాచార్యులు నిప్పులలోని కుటికి తడి పచ్చడముల సహాయమున స్వాములవారిని, దేవతార్చన పెట్టెలను అతి కష్టముమీద పైకిదీసికొని వచ్చిరి. సంస్థానము తాలూకు యెన్నో ఆభరణములు, రాజశాసనములు, దాన పత్రములు కాలిపోయినవి. దేవతా ప్రతిమలుగాని, పుస్తక భాండారముగాని కాలిపోలేదు. అపుడు మహీసూరు దివా ణమునుండి బాబూరాయు లనువారు వచ్చి కాలిపోకుండ యున్న వస్తువులనేర్చి జమచేసిరి. ర సేర్లు నవరత్నములు, కుంద కృష్ణాజిపంతు యిచ్చిన పచ్చల రామమూర్తి, విజయ నగర ప్రభువొసంగిన వజ్ర పదకము, బాజీరాయు లిచ్చిన కెంపు పదకము వైజయంతిమాల మున్నగునవి యా బూది యందు దొరికినవి. అపుడు మహారాజావారి అనుజ్ఞపైని ౨ లక్షల వరహాలు తెప్పించి బాబూరాయులు స్వాముల వారికొసంగిరి. ఎనిమిది దినములలోగా పూజోపకరణము లన్నియు సిద్ధముచేయబడినవి. ఈ యేర్పాటు లన్నియు గావించి బాబూరాయులు మైసూరునకు వెడలిపోయిరి.

కొంతకాలమైనపిదప కాశీ మొదలగు యాత్రలు స్వాములవారు గావించిరి. శ్రీరంగపట్టణ సమీపముననున్న సుబ్బరాయుల కొప్పలుకి రంగూరునం దుండగా స్వాముల వారికి దేహాయాస మేర్పడినది. అప్పుడు తమ పూర్వాశ్రమ మొండలి తమ్ములగు నవరత్న శ్రీనివాసాచార్యులకు సన్యాస మొసంగి సంస్థాన మొప్పగించిరి. పిమ్మట స్వాములవారికి

స్వస్థత యేర్పడినది. స్వాములవారి పుత్రులు బోధరాయాచార్యులు, నూతన స్వాములవారి పుత్రులు ముద్గలాచార్యులు యిరువురు మఠమందు ఘనవిద్వాంసులుగా నుండియుండిరి. మఠమునందు కలహ మేర్పడకుండ మహీసూరు మహారాజావారు స్వయమువచ్చి పెద్దస్వాములవారికి వంశరామ ప్రతిమనుమాత్ర మొసంగుచు, సంవత్సరమునకు ౧౨ వేల రూపాయలు వారికి మఠమునుండి పంపుచుండుటకు, ఇంకనెవరికి వా రాశ్రిమ మొసంగకుండుటకు కట్టడిచేసిరి. సమస్త మఠాధిపత్యము నూతనస్వాములపరము గావించిరి. ఈయేర్పాటు జరిగినపిదప నూతనస్వాములు మైసూరుసీమయందు, పెద్దస్వాములవారు రామేశ్వరము వైపు సంచారార్థము వెడలిపోయిరి. పిమ్మట పెద్దస్వాములు శివమొగ్గ యను స్థలమునకు వచ్చిరి. వీరి పుత్రులు వీరి వెనుకనే యుండిరి. వీరును ఝులిపి కృష్ణాచార్యులు కలిసి మహీసూరు మహారాజువద్ద ౧౬ వేల వరహాలు బహుమతిగా నొంది తద్ద్రవ్యమున హూళేహొన్నూరునందొక మఠమును గట్టించిరి. పెద్దస్వాములవారందే నివాసముండిరి. మహారాజువా రనేక కానుకల నొసంగిరి. ఈ సత్యధర్మ స్వాములవారినిగూర్చి యనేక మహిమలు వర్ణింపబడినవి.

(1) భాగవతము ౬-౧౨ స్కంధములకు టిప్పణి ౨) మహాభారతోద్యోగ పర్వాంతర్గత సనత్సుజాతీయమునకు (టిప్పణి (౩) తత్వసంఖ్యాన టిప్పణి (4) తత్వనిర్ణయ టిప్పణి.

ఈ గ్రంథములను స్వాములవారు రచించిరి. వికృతి శ్రావణ బ॥ ౧౩రోజున సిద్ధిపొందిరి. వీరి తదనంతరము వీరి వద్దనున్న వంశరామ విగ్రహము వీరి పుత్రులు బోధరాయాచార్యులు తెచ్చి మఠమున కొప్పగించిరని మహీసూరు సంస్థాన లిఖితములందు (రికార్డునందు) నమోదై వున్నది.

౨౯. సత్యసంకల్పతీర్థులు. ౧౭౫౨—౬౩.

వీరు పీఠాధిపత్యము వహించునప్పటికి సంస్థానము చిక్కులపాలై యుండినదని వెనుకటి వృత్తాంతమువలన దెలియుచున్నది. దీనికితోడుగా తూమబాధ యొకటి ఎదురొక్కనెను. పూర్వస్వాములవారి పుత్రుడు బోధరాయాచాచార్యులు తనకు వీలైన చిక్కులను గల్గించుచునేయుండెను. ఈ చిక్కులన్నియు నిట్లుండగా నీ స్వాములవారి పుత్రుడు ముద్గలాచార్యులు మఠద్రవ్యమును స్వేచ్ఛమై దుర్వినియోగము చేయమొదలిడెను. కడకు నిత్యదేవతార్చనముకూడ సాగుటకు వీలులేని పరిస్థితిగా నేర్పడినది. అపుడు ధారవాడ, హుబ్బళియందున్న మఠాభిమాను లందఱు నాలోచించి ఏకమై ఒక వ్యవస్థ నిట్లుగా నేర్పఱచిరి.

౧. ముద్గలాచార్యుల సర్వాధిపత్యమును దీసివేయవలెను.

౨. సంస్థానముయొక్క నిత్యనియమములు సంప్రదాయము ప్రకారము నడువవలెను.

3. సేవగావించువారికి క్రమప్రకారము వేతనములు లభింపవలయును.

౪. సంస్థానపత్రములు మున్నగునవి చక్కగాను, క్రమ రీతిగాను సిద్ధపరచియుంచవలయును.

౫. మఠద్రవ్యము నిష్కారణముగ మఠమువారికి తెలియకుండ నెవ్వరు ఖర్చుచేయరాదు.

ఇట్టి వ్యవస్థ నేర్పఱచి దీనిపై సంస్థానపు దస్కతు ఉంచబడినది. ఇట్టి వ్యవస్థ ఏర్పడిన కొలదికాలమునకే యీ ముద్గలాచార్యులు గతించిరి.

స్వాములవారు దక్షిణముగా బయలుదేరి శ్రీరంగము మీదుగా మైసూరు చేరుకొనిరి. మహీసూరు మహారాజు మిగుల వైభవముగా స్వాములవారి నెదుర్కొని కోటలోనికి గొనిపోయి యాదరించిరి. ఉత్తరాది మఠమున కొక మఠ మాపట్టణమున నిర్మించు ప్రయత్న మపుడు జరిగినది. స్వాములవా రాపట్టణమున రెండు నెలల పాటుండిరి. మహారాజావారే సంస్థానము ఖర్చునంతయు భరించుచు మఠమునకెన్నో సత్కార్యములుగూడ గావించిరి. పీఠవిగ్రహామునకు నవరత్నాభిషేకము, ముక్తాభిషేకము (మంచి ముత్యముల అభిషేకము) జరిగినది. స్వాములవారు సుధామంగళముచ్చట గావించిరి. ప్లవనామ సం॥ర ఆషాఢ శుద్ధ ౫ రోజున సిద్ధిపొందిరి.

30. సత్యసంతుష్టతీర్థులు. ౧౭౬3—౬౭.

లోగడ నిర్ణయప్రకారము మహీసూరు మహారాజావారు, మఠమునందలి పెద్దలు వీరి సలహాప్రకారము సత్య

సంకల్పతీర్థులు తమ యవసానసమయమున గూళి బాలా
చార్యులు అనివారి కాశ్రమ మొసంగి 'సత్యసంతుష్టులు'
అని నామముంచిరి. వీరు గురువు లుండునపుడే సంస్థానము
పూజ గావించుచుండిరి. మైసూరులో అణ్ణయ్యాచార్యులు
వారియింట గురువులు సిద్ధిపొందినపైని మహారాజు లానగర
మున గట్టించియిచ్చిన మఠమునందు వీరు గుర్వారాధన
మొనరించిరి.

స్వాములవారు సకలశాస్త్రపారంగతులు, వాదకుశ
లులు. కావుననే వీరికి 'శాస్త్రగూళి' అనుప్రసిద్ధి యేర్పడెను.
మహీసూరు ఆస్థానపండితులగు ఆనందాళ్వాడు అనువారు
స్వాములవారికి పూర్వాశ్రమమున శిష్యులు. వీరిని స్వాముల
వారు తమసంస్థానమునకు రప్పించుకొని వీరితోడకలిసి శాస్త్ర
చింతనము గావించుచుండిరి. వీరికాలమున ఘనులగు విద్వాం
సులు పలువురుండిరి. కాశీ తిమ్మణాచార్యులు, తిరుపతి శ్రీని
వాసాచార్యులు, బ్రహ్మండ విష్ణుపాదాచార్యులు అందు
ముఖ్యులు. చతుశ్శాస్త్రపారంగతులగు నీపండితులతోడగూడి
స్వాములవా రొకప్పుడు మహీసూరుసంస్థానమున గొప్పవిద్వ
త్సమావేశము గావించిరి. సమాగతులగు విద్వాంసులనంద
ఱను మహారాజావారు స్వయముగా సత్కరించిరి. మహారాజా
వారి యాదరవిశేషమునకు, బహుమతులపరిమితికి అమితా
నందమందిన విద్వాంసులందఱు ధన్యవాదము లర్పించిరి.

స్వాములవారిస్వేచ్ఛ నరికట్టుచు వెనుకటిసంఘటమును
బురస్కరించుకొని కల్లాపురపు భీమవగాహాచార్యులు కుంభ

కోణము దివాణ వెంకటరాయుడనువాని సహాయముతో మైసూరు, ఇంగ్లాండు పరిపాలకులను మంచిచేసికొని వారివద్ద నుండి 'సదరు కల్లాపురపు భీమవరాహాచార్యులకే ఉత్తరాది సంస్థానము నిర్ణయింపబడవలెను' అనుమాటను గల్పించుకొని గలాటా ప్రారంభించెను. అప్పుడు మతానుయాయులందఱు దీనిని దిలకించి మహీసూరు మహారాజావారి యనుమతి నొం దుచు నాయమలు జరుగకుండ సరిచేసిరి. పారుపత్య బాళా చార్యులు, బ్రహ్మాండ విష్ణుపాదాచార్యులు వీరిద్దఱు నిం దుకై ప్రయత్నముగావించి కృతకార్యులైరి. మైసూరునందు విశ్వావసు ఫాల్గుణ బ౩౦ రోజున స్వాములవారు సిద్ధిపొందిరి.

### ౩౧. సత్యపరాయణతీర్థులు ౧౭౬౭-౮౫.

వీరి పూర్వాశ్రమనామము హావేరి గురురాయా చార్యులు. వీరు సత్యసంధుల వంశమువారు. 'సంస్థానము సర్వ కార్యములు సంప్రదాయముప్రకారము నడిపించెదను' అని ప్రముఖులయెదుట ఖరారుగావించి (పత్రము వ్రాసియిచ్చి) వీరుత్తరాదిమఠ సంస్థానాధీశ్వరులుగా నేర్పడిరి. వీరు సంచా రము గావించుచు హైదరాబాదుసంస్థానమునకు బోయిరి. రాజా గోపాలరాయలు మున్నగువారివలన సత్కారము లేర్పడెను. నైజాము దివానులగు రాజా చందూలాల్ మూలముగా సంస్థానమున గొప్పమర్యాదయేర్పడెను. సారి, కుంబారి మొదలగు గ్రామములు, దుశ్శాలువలు, ౫ వేల రూపాయలు బహుమతిగా నొసంగబడెను. దివానుగారును

౫ బంగారపు (తాటుగళ్ళన్ను) నూరువరహాలు, కంఠపథకము సత్కరించిరి. ౨౫ అరబ్బుసిపాయిలు, ౨౫ రోహిలా సిపాయిలు సంస్థానము కాపుదల నిమిత్తము నిజాముసంస్థానముచే నొసంగబడెను. సంస్థానప్రదేశమం దెల్లను స్వాములవారికి బహుమన్నన యేర్పడునటుల నిజాముప్రభువు తమయధికారులకు హుకుము నొసంగెను. పిమ్మట లింగంపల్లి యను స్థలమునకు ఉత్తరాదిమఠము వచ్చెను. అప్పుడచ్చట ప్రాణదేవుని ప్రతిష్ఠ, ఈశ్వరప్రతిష్ఠ జరిగెను. ౧౦వేల బ్రాహ్మణ భోజనము జరిగెను. ఆయుత్సవ సమయమున స్వాములవారచ్చటినుండి గద్వాలునకు వెళ్ళిరి. ఆరాజు స్వాములవారిని విశేషముగా బూజించెను అక్కడనుండి స్వాములవారు ధారవాడకు వెళ్ళిరి. సత్యసంకల్పతీర్థులకాలమున సంస్థానమునకు ౨ లక్షలు అప్పు ఏర్పడెను. సంస్థానాభరణాదులు తాకట్టులో నుండెను. పెద్దవేతనమువారివల్ల రెండు నెలలజీతములు చిన్నవేతనములవారివల్ల ఒకనెలజీతము స్వాములవారు పుచ్చుకొనిరి. మఱియు, శ్రేష్ఠులు, సాహుకారులు, దేశాయులు, దేశపాండులు మున్నగువారివలన బహుమతుల నొసంగిరి. గయావళులు ౨౫ వేలరూప్యములు బహుమతి నొసంగిరి, ఇట్లుగా స్వాములవారు ద్రవ్యమును సేకరించి ఋణమునంతయు దీర్చివేసిరి.

స్వాములవారు కొల్హాపురమునకు బోయి అచ్చట నాసువుగా లక్ష్మీదండకము గావించిరి. లక్ష్మీదేవికి లక్ష

కుంకుమార్చనము గావించి వేయిమంది ముత్తైదులకు చీరలు, రవికెలగుడ్డలు నొసంగిరి. వేయి మందిదంపతులకు అన్నసంతర్పణము గావించిరి. కొల్హాపురరాజు ౨ ఏనుగులు ౨౫ రోహిలాసిపాయలను నొసంగెను.

స్వాములవారు నాగపూరుమీదుగా తూలారా యను స్థలమునకు రాగా నక్కడ దొంగలవలన గలాటాయేర్పడెను. రోహిలా జమాదారు ధైర్యమున, నుపాయమున నీసంకటమును దప్పించెను. దొంగ లపుడు పశ్చాత్తప్తులై స్వాములవారికి నమస్కరించిరి. వారే దారిచూపువారై సంస్థానమును నర్మదానదీతీరమువఱకు గొనితెచ్చిరి. స్వాములవారు జబల్ పూర్ లో అన్నసంతర్పణము గావించిరి. ౩ నెలలు ప్రయాగలోను, ౩ నెలలు కాశీలోను స్వాములవా రుండిరి. కాశీలో విద్వత్సమావేశము గావించి సభాసదులగు విద్వాంసులందఱకు వస్త్రాలంకారాది సత్కారములను గావించిరి. గొప్పసమారాధనము గావించిరి. తిరుణాచార్యులవారికి కాశీలో మఠాధిపత్య మొసంగిరి. స్వాములవారినిగూర్చి గొప్పమహిమలు వర్ణించిచెప్పెదరు.

ఉత్తరదేశసంచార మెక్కువగా జేయగోరి స్వాములవారుఖిల్నిస బోధరాయాచార్యులనువారినికలకత్తాకు బంపగా వారక్కడ బ్రిటిష్ ప్రభుత్వాధికారులనుండి యనుమతిపత్రమును గొనివచ్చిరి. సుంకాదులగు నిబ్బందులేమియు లేకుండ స్వాములవా రుత్తరాదియాత్రలు సాగించిరి. ఢిల్లీలో గొప్ప

వారిని విశేషముగా సత్కరించెను, తిరుపతి యాత్రనుముగించు
కొనిస్వాములవారుపద్మసరోవరమునకు బోయియ్యకడ వారము
రోజులుండిరి. ధారవాడ, హుబ్బలిమీదుగా బయలుదేరిఉడిపీకి
వెళ్లిరి ౧౨ వేలరూపాయిలు ఉడిపీకృష్ణునకు సమర్పించిరి.
విద్వత్సభ నేర్పఱచి వాక్యార్థము గావింపజేసిరి. సభానంత
రము విద్వత్సత్కారము గావించిరి. విరోధికృతు మాఘ
శు ౧౧ రోజున గోదావరీతీరమున రాజమహేంద్రవరమున
స్వాములవారు సిద్ధిపొందిరి,

౩౮ సత్యధ్యానతీర్థులు. ౧౮౩౨—౧౮౬౩

జగము సత్యమటంచు స్థాపించు ధ్యానంబు గలిగి ద్వైతంబును
నిలుపువారు
సత్యాత్మ మహిమజ్ఞ సర్వతోధిక దృఢస్నేహాన హరిని
ధ్యానించువారు
మాధ్వేశ సుఖతీర్థమౌని పూర్ణప్రజ్ఞ సార్థకశిష్యులు జగతి వారు
అసమానపాండితీ హాస శోభాననాంభోజా హ్వ సుమనోజ్ఞ
మూర్తి వారు
మూల రామార్చ నానందమూర్తి యగుచు।
దిగ్విజయరాము సేవించి దిగ్విజయము
చేసి యున్నారు గురువలశ్రేష్ఠు లిలను।
వందనశతంబు లర్పింతు వారి కెపుడు.

వీరి పూర్వాశ్రమనామము కోర్లహల్లి సీతారామా
చార్యులుగారు. యత్యాశ్రమ స్వీకారయుక్తమగు యోగ్య
కుటుంబమున నుద్భవించిన వీరు సత్యజ్ఞానతీర్థులవారి కాల

లకు మృష్టాన్నభోజనము గావింపబడుచుండెను. బాజీరాయు లాఖుగుదినమున 30 వేల రూపాయలు, ముత్యాలహారము, వైజయంతీమాల, ౧౨ ఏనుగులు, వెండిబంగారపు నాభరణము లొసంగి సత్కరించెను. పిమ్మట స్వాములవారు జగన్నాథ మునకు వెడలిరి. అక్కడనుండి రాజమహేంద్రవరమునకు బోయిరి. విడిగానున్నరత్నముల నక్కడ హారముగా గట్టించి యది మూలరాముని కంఠసీమ నలంకరింప జేసిరి. విజయనగర ప్రభువు (హంపి) గ్రామాదుల నొసంగి స్వాములవారిని సత్కరించెను. స్వాములవారు సేతుస్నాన మొనరించి మైసూరునకు వచ్చిరి. మహీసూరుమహారాజు స్వాములవారిని సత్కరించి బంగారపుముద్రలు (తప్తముద్రధారణార్థముగా) సమర్పించెను. స్వాములవారు మైసూరునందు 3 నెలలుండిరి. రుధిరోద్గారి ఆశ్వయుజ బ ౭ రోజున స్వాములవారు సిద్ధి పొందిరి.

## ౩౨ సత్యకామ తీర్థులు, ౧౭౮౫-౯౩

వీరి పూర్వాశ్రమనామము వాచ్ఛాపురము శ్రీనివాసాచార్యులు. వీరు పీఠాధిపత్యమువహించి మహీసూరు సంస్థానమునకు బోయి యామహారాజుచే సత్కారముల నొందిరి. ఉభయస్వాముల వంశజులగు (సత్యసంధ, సత్యపరాయణతీర్థుల వంశమువారగు) నవరత్న భీమాచార్యుల వారిని ప్రస్తుతస్వాములవారిపుత్రులగు వాచ్ఛాపురపు ఆచార్యులను మహారాజావారు విశేషముగ సత్కరించిరి. నాస్వా

ములవారు శిష్యులవద్దనుండి జీతములను—పెద్దజీతములవారినుండి
౨ నెలలజీతములను, చిన్న జీతములవారినుండి ఒక నెలజీతములను పుచ్చుకొనియున్నారు. అట్టియవసర మేర్పడకుండ మహారాజావారు నరసింహాపురమున ఆరు నెలలపర్యంతము ఉత్తరాదిమఠము నుంచి ఖర్చువెచ్చములను తాము భరించిరి. ఆసంవత్సరమున నాలుగు నెలలుమాత్రమే స్వాములవారు సంచారమొనరించి హైదరాబాదునకు విచ్చేసిరి. అక్కడ బంగారపుబిందె, బంగారు సంపుటము, బంగారుపంచపాత్ర మొదలగు క్రొత్తవైనయుపకరణములను జేయించిరి. రాజా ఇంద్రజిత్తు, రాజా రాయులు స్వాములవారిని విశేషముగ సత్కరించి కెంపులతోగూడిన వజ్రహారము (కంఠాభరణము) ౨ వేలరూప్యముల నొసంగిరి. పేష్కారులు దివాణ సరసాల జంగులు అనువారు ౨ గుఱ్ఱములు, ౧ ఏనుగు, ౬ అరబ్బు సిపాయులు మొదలగునవి సత్కారముగా లభింపజేసిరి. శికిందరాబాదులో బండలి శ్రీనివాసరాయులు రత్నపథక హారమును సమర్పించిరి. మహబూబునగరమున హనుమంతరాయలను సంపన్నగృహస్థునిభార్యకు గ్రహబాధయుండగా మఠశిష్యులగు చిన్నపల్లి శేషదాసులనువా రా గ్రహబాధలను తొలగించిరి, హనుమంతరాయలు 'గురువిజయవిఠల' అను మకుటముగల కీర్తనలను గావించి దేవతారాధనము గావించిరి. అమూల్యమగు ఛత్రచామరములను, శాలువలను సమర్పించిరి. భార్యయొక్క గ్రహబాధ తొలగింపబడి

నందులకు సంతోషమొంది వీరొక సంవత్సరకాలము ఉత్త
రాదిమఠ్యమును సమస్తమైనఖర్చులను భరించుచు తమవద్ద
నిలుపుకొనిరి. మఱియు ననేకమైన కానుకల నొసంగిరి.
పిమ్మట స్వాములవారు ఆత్మకూరునకు వచ్చిరి. పరిజోత్పత్తి
పుష్య బ ౬ రోజున సిద్ధిపొందిరి.

33. సత్యేష్టతీర్థులు. ౧౭౫3-౧౭౫౪.

వీరి పూర్వాశ్రమనామము హత్తిమత్తూరు నరసింహా
చార్యులు. ముసలివారగుటవలన వీరెక్కడికి సంచారమునకు
బోలేదు. వాచ్ఛాపురము మధ్వరాయాచార్య లనువారు
తమకు దోచినరీతిగా మఠద్రవ్యమును వెచ్చించుచుండుటచే
శామభాగ శ్యామాచార్యులు, కిన్హాళ లక్ష్మీకాంతాచార్యులు
నిజామునవాబువారివలన వీరిని సంస్థానమునుండి పంపివేయ
గల్గిరి. మఠప్రముఖుల సలహానను సరించి స్వాములవారు సంప్ర
దాయముప్రకారము సంస్థానవ్యవహారము నడిపించుచుండిరి.
పూర్వాశ్రమమున సంపాదించిన ద్రవ్యమున బంగారుగిన్నె
నొకటిచేయించి దానిపై తల్లిపేరు వేయించి యాగిన్నెచేతనే
మూలరామునకు స్వాదోదకాభిషేకము గావించుచుండిరి.
మితాహారులై కృష్ణాజినముపైననే పరుండుచుండిరి. సదా
జపపారాయణపరులై యుండిరి. పాదుకలనుకూడ విసర్జించిరి.

వరద శ్రీనివాసాచార్యులనువారు స్వాములవారి సమ
క్షముగ ఋగర్థమునుగూర్చి యుపన్యాసము నిచ్చుచుండెడి
వారు, అవి వినుటయందు స్వాములవా రెక్కువ శ్రద్ధను

జూపుచుండిరి. మఱియు బ్రహ్మసూత్రార్థవివరణముగావించు చుండిరి. కంచి సుబ్బరాయలు నవరత్న సత్యాధిరాజా చార్యుల కాశ్రమ మీయవలసినదను నభిప్రాయమును వెలి బుచ్చిరి. శ్యామభాగ, శ్యామాచార్యులు బ్రహ్మాండం విష్ణుపాదా చార్యుల కిమ్మను నభిప్రాయమును వెలిబుచ్చిరి. స్వాముల వారు వేఙాకరి కాశ్రమ మొసంగిరి. స్వాములవారికి స్వప్న మున నిట్టిప్రేరణ మైనదని వినికిడిగలదు. ఆంగీరస భాద్రపద శు ౧౧ రోజున స్వాములవారు సిద్ధిపొందిరి.

### ౩౮. సత్యపరాక్రమ తీర్థులు. ౧౭౯౮-౧౮౦౧.

వీరి పూర్వాశ్రమ నామము వాయి శ్రీనివాసా చార్యులు. వీరు లౌకిక వైదిక ప్రజ్ఞాధురంధరులు. వాచ్ఛా పురము ఆచార్యులు మొదలగువారివల్ల గల్గిన యిబ్బందుల నెల్ల వ్యవహారకుశలులై సరిచేసికొని పిమ్మట స్వాములవారు దిగ్విజయమునకు బయలుదేరిరి. 'అన్నసంతర్పణమందు ఉత్త రాదిమఠము మేలు' అన్న పూర్వపుకీర్తి వీరికాలమున విశే షముగా నుండినది. స్వాములవారు అసదృశమగు వాదకుశ లము గల్గినవారు. వీరి పూర్వాశ్రమపు తమ్ములు వాయి వాసుదేవాచార్యులుగూడ నట్టివారే. వీరుభయులు బహువిధ విద్వత్ప్రసంగములు గావించుచుండిరి. స్వాములవారికి పాఠ ప్రవచనమం దెక్కువపట్టుదల గలదు. బోధరాయాచార్యులు కనకబండి కృష్ణాచార్యులు, హానగల్లి భీమాచార్యులు, స్వాములవారి పూర్వాశ్రమపుత్రులు భీమబాళాచార్యులు,

విఠోబాచార్యులు, కృష్ణాచార్యులు మున్నగువారు స్వాముల వారి సమక్షమున న్యాయవేదాంతమీమాంసాదిశాస్త్రముల నభ్యయనము చేసియుండిరి. స్వాములవారికి చక్కని యుప న్యాసధోరణి గలదు. అందువలన ప్రతిస్థలమందు వేలాది ప్రజలు స్వాములవారి యుపన్యాసములు విని యానందించెడి వారు. ఇట్టి కార్యక్రమమందు నిమగ్నులైయున్న స్వాముల వారు లౌకికవ్యవహారమును తగ్గించి శామభాగ శామాచార్యు లనువారికి సంస్థానము గుత్తయిచ్చి సాలుకు వారివద్దనుండి 3౫ వేల రూప్యములు గైకొనుచుండిరి.

పిమ్మట సంస్థానము హైదరాబాదునకు తరలెను. రాజా శివరాజబహద్దూరు, కారూన శ్రీనివాసరావు మొదలగువారి వలన 'సాలీ, కుంబారి' యను గ్రామములు తిరుగ సంస్థానము నకు దఖలుపడినవి. శికిందరాబాదులో పెద్దవిద్వత్సభ ౧౪ రోజులు జరిగెను. మహీసూరు సంస్థానము ధర్మాధికారులగు రామంగిరి శామాచార్యుల ప్రోత్సాహమున, వాయి వాసు దేవాచార్యుల ప్రోద్బలమున నేర్పడిన యావిద్వత్సభలో జనార్దనాచార్యులు, బికాచార్యులు, రామశాస్త్రి, దాదా దత్తోపంచ మహామహోపధ్యాయ మున్నగు ఘనవిద్వాం సులు పాల్గొనిరి. స్వాములవారి పాండిత్యప్రకర్ష యాసభలో మిక్కిలిగా ప్రకాశితమాయెను. స్వాములవారు విద్వాంసుల నందఱిని సత్కరించిరి.

సంస్థానము ముఖ్యాధికారము నిమిత్తముగా వాయి వాసుదేవాచార్యులు, స్వాములవారి పూర్వాశ్రమపుత్రులు

భీమబాలాచార్యులు. వీరిరువురిమధ్య పెద్దతగాదాయేర్పడెను. అది తెగనిసమస్యగా పరిణమించెను. 'శ్రీసత్యసంకల్పగురురాజు' అను ముద్రనుపయోగించి సకలవ్యవహారములందు సదరు వారు వాసుదేవాచార్యులు దఖలు గల్గించుకొనుచుండగా చివరకు 'దిగ్విజయరామో విజయతే-ఉత్తరాదిమఠము' అను ముద్రను వినియోగించి భీమబాళాచార్యులకు ముఖ్యాధికారము దఖలుచేయబడినది

ఈస్వాములవారికాలమున ననేకులు ద్వైతమతమును స్వీకరించిరి. గోదావరీతీరమందలి సోన్ని యనుస్థలమున ప్రాణదేవునివిగ్రహమును ప్రతిష్ఠచేయించిరి. వచ్చిన యిబ్బందులను, ఆక్షేపణలను మెలకువగాదాటిరి. స్వాములవారు విద్వద్దామోదముగా నుత్తరాదిమఠాధిపత్యమును సాగించిరి. కృష్ణానదీతీరమందలి చిత్తాపురమున ప్రమాథి ఆశ్వయుజ శు ౮ వ రోజున సిద్ధిపొందిరి.

### ౩౫. సత్యవీరతీర్థులు ౧౮౦౧–౧౮౦౯

వీరి పూర్వాశ్రమనామము కోర్లహల్లి బోధరాయాచార్యులు. జడ్జి తిరుమలరాయలు, వకీలు బెళగాని హుచ్చురాయలు. వీరిని బిలిపించి వీరిమూలమున సంస్థానము పరిస్థితులను స్వాములవారు చక్కజేసిరి పూర్వాశ్రమమున మిగుల ప్రసిద్ధులైయున్న వీరు సంచారమునకు వెడలగా నందఱును వీరిని గౌరవించిరి. వ్యాకరణము, అలంకారము, కావ్యము వేదాంతము వీనియందు నైపుణ్యముగల్గిన వీరి యుపన్యాసల

హారికి జనులెల్లరు నానందపారవశ్యము నొందుచుండెడివారు. యువకులైన వీరు ప్రతివిషయమున నుత్సాహముగ బ్రవర్తించుచుండిరి.

ధారవాడయందు 'తప్తముద్రధారణము అనావశ్యకము' అని హైస్కూలు సంస్కృతాధ్యాపకులగు అణ్ణాశాస్త్రి అనువారు ఒకవాదమును బయలుదేరదీసిరి. మదిహోలు అనుస్థలమున నృసింహదేవాలయమున సభజరిగెను. అపుడే 'తప్తచక్రభూషణము' అనుగ్రంథమును స్వాములవారు రచించి ప్రకటించిరి. స్వాములవారు హైదరాబాదుకు వెడలి అక్కడ ౫౦,౦౦౦ రూపాయలు ఖర్చుపెట్టి గొప్పగా అన్నసంతర్పణము గావించిరి. విద్వత్సత్కారము గావించిరి.

మదరాసునందున్న దివాన్‌బహద్దూరు రఘునాథరాయలు అనువారు స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమని యొకవాదమును బయలుదేరదీసిరి. స్వాములవా రొకలక్ష రూపాయలు వెచ్చించి దేశదేశపండితులను రప్పించి గొప్ప పరిషత్తు నేర్పఱచిరి. కర్హాడ గోపాలాచార్యులు, ఉమర్జి బాళాచార్యులు, కంచి సింగరాచార్యులు, తంజావూరు సాంబశాస్త్రి, కుంభకోణము కృష్ణశాస్త్రి అను పండితులందు పాల్గొనిరి. తారణసంవత్సర భాద్రపద ౧౫ నాడు పరిషత్తు ప్రారంభమైనది. 'నేర్గో' అను వ్యాకరణసూత్రముపై గొప్పచర్చ యేర్పడెను. ఆసభయందు సర్. టి. కనకరాయలు, కంచి సుబ్బరాయలు ద్రష్టలుగా నేర్పడి

యుండిరి. ఆసమావేశ మైదుదినములు జరిగెను. అపుడు తిరు వాది లక్ష్మణాచార్యులను శతావధాను లంతవఱకు జరిగిన శాస్త్రవాదమంతయు ననువాదము గావించి వివరించినపైని మరల చర్చ ప్రారంభమాయెను. తొమ్మిదిరోజులు పరిషత్తు జరిగెను. స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమని శ్రీనివాసాచార్యులు, చిత్తూత్తశాస్త్రులు హిడాంబి అనువారు వాదించిరి. 'స్త్రీపునర్వివాహ మశాస్త్రీయము' అని యాసభయందు నిర్ణయమైనది. ప్రతివాదులు తమవాదము పరాస్తమగుట నంగీకరించిరి, సభానంతరము స్వాములవారు విద్వాంసులను సత్కరించిరి. సభాకార్యక్రమమును, వాదప్రతివాదములను స్వాములవారు ముద్రింపించి దేశమందు పంచిపెట్టిరి. పత్రికా ప్రకటనము గావించిరి.

స్వాములవారు మంచాకొప్ప యనుప్రాంతమునకు రాగా నొకయపవాదము బయలుదేరెను. 'స్వాములవారు అతిజల్దీగా దేవతార్చనము ముగించుచున్నారు. తంత్రసారోక్త పూజావిధానము స్వాములవా రాచరించలేదు. పీఠాధిపతులు ప్రవర్తనయే యిట్లయిన నిఁక లోకులమాట యేమిచెప్పదగినది' అను అపవాదము గల్గెను. వేఱొక యప వాదముగూడ గల్గెను, 'మహాసమారాధనము మున్నగునవి వెనుకటిస్వాములట్లు వీరు గావించలేదు. లోభత్వమును వహించుచున్నారు. పూర్వాశ్రమపుత్రుల కుత్పన్నమును గల్గించుచున్నారు' అనియు నపవాదము గల్గెను, 'మధ్వ

సిద్ధాంతోజ్జీవినీసభాస్థాపకులైన కంచి సుబ్బారావుగారు కూడ నిందుండుటచే స్వాములవా రత్యంతము ఖిన్నులైరి. ఆసంవత్సరము మహావిజృంభముగా మహాసమారాధనము జరిగించి పెద్దవిద్వాంసులకు ౧౦౦,౨౦౦ పర్యంతముగు దక్షిణల నొసంగిరి. అందు ప్రత్యేకముగ సమావేశమున 'పూర్వాశ్రమపుత్రుడు కేసూత్రిముగూడ మతద్రవ్యము ముట్టలేదు' అని స్పష్టము చేసిరి. ఇది తెలిసి కంచి సుబ్బారావుగారు స్వాముల సమక్షమునసాష్టాంగ మొనరించి మన్నింపవేడిరి. 'కంచిసుబ్బారావుగారు స్థాపించిన మధ్వసిద్ధాంతోజ్జీవినీసభ నిఖిల దేశమునకు సంబంధించియున్నది. ఉత్తమమైన యీవ్యవస్థ సక్రమముగా కొనసాగనీయదగును' అని పెద్దలందఱు స్వాములవారికి మనవిగావించిరి. స్వాములవారి యనుజ్ఞనొంది కంచి సుబ్బారావుగారు వెడలిపోయిరి.

ఆరణీరాజు తనకు పుత్రుడుగల్గినందుల కుత్సాహియై స్వాములవారిని విశేషముగ సత్కరించి ౧౨ వేలరూపాయలు సమర్పించెను. పిమ్మట స్వాములవారు బళ్ళారిమీదుగా కూర్గహల్లికి వచ్చిరి. వ్యయ కార్తిక శు ౧౦ రోజున సిద్ధి పొందిరి.

## ౩౬. సత్యధీర తీర్థులు. ౧౮౦౮–౧౮౨౮

వెనుకటి స్వాములకాలమున సంస్థానమున వ్యవహారములు చిక్కులలో బడియుండెను. హొరకల్లు భీమసేనాచార్యులు ముండదగి కనకరాయలు మున్నగువారు చిక్కోడు

జయరామాచార్యులు అనువారి కాశ్రిమమిప్పించిరి. సత్యధీర అని యాశ్రిమనామ మేర్పడెను. సంస్థానాధిపతులైన పిమ్మట సత్యధీరస్వాములవారు మెలకువగా బ్రివర్తించి వెనుకటి సంకటపరిస్థితినంతయు సరిదిద్దుకొని యలజడిలేకుండ చేసిరి. హుచ్చురావు అనువకీలు ఇందు విశేషశ్రిమనొంది వ్యవహారము చక్కజేసెను.

మహీసూరు సంస్థానము దివాను శేషాద్రిఅయ్యర్ మూలముగా సంస్థానమున స్వాములవారికి మర్యాద జరిగెను. గొప్పగా సత్కారము జరిగెను. అప్పు డక్కడ పెద్దసభ జరిగెను. చిక్కోరూరు స్వామిరాయాచార్యులు, కస్తూరి రంగయ్యంగారు బెంగుళూరు పండితరత్న రామశాస్త్రి, కాశీ రామశాస్త్రి మున్నగువా రా సభయందు ప్రిముఖులుగా నుండిరి. సభానంతరము స్వాములవారు పండితులను విశేషముగా సత్కరించిరి. అటుపిమ్మట స్వాములవారు దక్షిణోత్తరయాత్రిలన్నియు గావించి భాగ్యనగరసమీపమునకు వచ్చిరి. అక్కడ అస్వస్థతయేర్పడగా కిన్నాళ జయాచార్యులనువారి కాశ్రిమ మొసంగి క్రోధిసంవత్సర ఆశ్వయుజ శు ౨ రోజున పీఠాధిపత్య మొసంగిరి. పిమ్మట స్వస్థత నొందినవారైరి. ఉభయస్వాములు కలసి కొన్నాళ్ళు సంచారము సాగించిరి,ఆత్మకూరునందు సత్యధీరస్వాములవారు పరాభవ జ్యేష్ఠ బ౯ రోజున సిద్ధిపొందిరి.

32. సత్యజ్ఞానతీర్థులు. ౧౮౨౬—౧౮33

వీ రుత్తరాదిమఠమున బహువైరాగ్యసంపత్తి గల్గి యధ్య యన మొనరించుచుండిరి. ♦ వీరును, సత్యధీరస్వాములవారి పూర్వాశ్రమపుత్రులు సేతూ రామాచార్యులుగారును కలసి గురువులవద్ద సకలశాస్త్రము లభ్యసించిరి. వైరాగ్యసంపన్ను లగు వీరు తమ 3౨ సంవత్సరమున నాశ్రమస్వీకార మొం దిరి. వీరి వైరాగ్యసంపదకు మిక్కిలిగా బ్రీతినొందిన సత్యధీర స్వాములవారు వీరి కాశ్రమమొసంగినపైని స్వస్థతజెందియు మఠాధిపత్యమంతయు వీరియందే నెలకొల్పియుండిరి. అట్లుగా గురువులసమక్షమున వీరు సుమారు రెండేండ్లు పీఠాధిపతులుగా నుండిరి. గురువులు సిద్ధిపొందినపిమ్మట వీ రాత్మకూరునందు గుర్వారాధన మొనరించి యక్కడనుండి మళఖేడకు వచ్చిరి. వరియన్నమును విడనాడి కొఱ్ఱబియ్య మన్నము తినజొచ్చిరి. గోగర్భమున నేర్పడిన గోమయమిశ్రితమైన బియ్యము నేతి యవి వండించి చిక్కనైవేద్యము గావించి యది యాహార ముగ గొనుచుండిరి. మితాహారులగుచు ప్రతినిత్యము ౧౨ వేల ప్రణవజపము చేయుచుండెడివారు. ౭౨ మహామంత్ర ములను జపించుచుండెడివారు. సుధామంగళ మాచరించి పిరివిగా నన్నసంతర్పణము గావించిరి. సంస్థానకార్యభార మంతయు గురుపుత్రులగు సేతూ రామాచార్యులవారి కప్ప గించి స్వాములవారు నారాయణసేవా (ధ్యాన) తత్పరులై

---

♦ కినాళ్ళి జయాచార్యులుగారు సేతూ రామాచార్యులవద్ద శాస్త్రాభ్యాస మొనరించిరని తెలియవచ్చినది,

యుండెడివారు. మళఖేడనుండి బయలుదేరి స్వాములవారు తిరుపతికి వచ్చిరి. స్వాములవారు స్వామిసందర్శనమునకు కొండపైకి వచ్చుచున్నారని విని తిరుపతిమహాంతు విశేషముగా గౌరవించెను. దేవతార్చనపెట్టెయు ఎడబలసేవకులపైనుంచి సకలవాద్యవైభవయుక్తముగ స్వాములవారు పండితపురస్కృతులై వేంకటాచలమును నెక్కసాగిరి. నృసింహామంటపముదరికి స్వాములవారు వచ్చుసరికి దేవస్థానమువారు ఛత్రిఛామరాదివైభవయుక్తముగ నెదురువచ్చి సగౌరవముగ ధ్వజస్థంభమువఱకు గొనివచ్చిరి. స్వాములవారి సందర్శనార్థమక్కడ పదివేలకుపైబడిన బ్రాహ్మణులు నిలిచియుండిరి. స్వాములవారు ముందుకుసాగ వీలయినదికాదు. అప్పుడా బ్రాహ్మణులను ప్రక్కకుదొలగింప నొత్తిడికల్గించుట గాంచి స్వాములవారు ఖిన్నులైరి. భాగవతము పంచమస్కంధమందలి ౨౪ శ్లోకమును. దశమస్కంధమందలి ౧౮వ శ్లోకమును స్వాములవారుచ్చరించి యాయొత్తిడిని మాన్పించిరి. ఆనాడా చేరిన బ్రాహ్మణ్యమునకు మృష్టాన్నభోజనమేర్పాటు గావించిరి, శ్రీనివాససందర్శన మొనరించి ద్వాదశస్తోత్రములను, వేంకటేశస్తోత్రమును పఠించుచు భక్తితో మంగళహారతి నొసంగిరి. ఆదినము దేవస్థానముఖర్చంతయు రామసంస్థానమునుండి జరిగెను. వైభవోపేతముగా గరుడోత్సవాదులు జరిగింపబడినవి. ఆమంత్రిణోత్సవము, బ్రహ్మోత్సవము ఘనముగా జరిగింపబడినవి. మహాంతు స్వాముల

వారిని విశేషముగా సత్కరించెను, తిరుపతి యాత్రనుముగించు
కొనిస్వాములవారుపద్మసరోవరమునకుబోయియక్కడ వారము
రోజులుండిరి. ధారవాడ, హుబ్బళిమీదుగా బయలుదేరిఉడిపికి
వెళ్లిరి ౧౨ వేలరూపాయిలు ఉడిపికృష్ణునకు సమర్పించిరి.
విద్వత్సభ నేర్పఱచి వాక్యార్థము గావింపజేసిరి. సభానంత
రము విద్వత్సత్కారము గావించిరి. విరోధికృతు మాఘ
శు ౧౧ రోజున గోదావరీతీరమున రాజమహేంద్రవరమున
స్వాములవారు సిద్ధిపొందిరి,

౩౮ సత్యధ్యానతీర్థులు. ౧౮౩౨—౧౮౬౩

జగము సత్యమటంచు స్థాపించు ధ్యానంబు గలిగి ద్వైతంబును
నిలుపువారు
సత్యాత్మ మహిమజ్ఞ సర్వతోధిక దృఢస్నేహాన హరిని
ధ్యానించువారు
మాధ్వేశ సుఖతీర్థమాని పూర్ణప్రజ్ఞ సార్థకశిష్యులు జగతి వారు
అసమానపాండితీ హాస శోభాన నాంభోజాస్య సుమనోజ్ఞ
మూర్తి వారు
మూలరామార్చనానందమూర్తి యగుచు।
దిగ్విజయరాము సేవించి దిగ్విజయము
చేసియున్నారు గురువలశ్రేష్ఠు లిలను।
వందనశతంబు లర్పింతు వారి కెపుడు.

వీరి పూర్వాశ్రమనామము కోర్లహళ్లి సీతారామా
చార్యులుగారు. యత్యాశ్రమ స్వీకారయుక్తమగు యోగ్య
కుటుంబమున నుద్భవించిన వీరు సత్యజ్ఞానతీర్థులవారి కాల

మున నుత్తరాదిమఠదివానుగా నుండి సంస్థానసేవ గావించుచు యత్యాశ్రమమును వారివల్ల గ్రహించిరి. తమసర్వస్వమును పీఠమునకే సమర్పించి ఉత్తరాదిమఠాధిపతులై విలసిల్లిరి. లౌకికవైదికసంపత్తి సంపూర్తిగగల్గిన వీరు ఉభయతః పీఠము నుద్ధరించిరి.

ఆసేతు హిమాచలపర్యంతము వీరు దిగ్విజయము గావించియున్నారు. యావద్భారతదేశపండితులును స్వాములవారి సత్కారము నొందియుండిరి. 'ఉత్తరాదిమఠాధిపతుల రాక (సత్యధ్యానతీర్థులవారి యాగమనము) పండితసత్కారశోభితము' అనుకీర్తి సకలమతపండితులందును నేర్పడినది. ఆర్షవిద్యల నభ్యసించు విద్యార్థులకు ప్రోత్సాహము కల్గించుచు విరివిగా సంభావనల నొసంగిరి. పీఠాధిదైవములను పూజించుచు భూరిసమారాధనముల విప్రతతిని తరియింప జేసిరి. వీరిప్రోత్సాహమున సత్యజ్ఞానతీర్థులకాలమునాడు ౧౮౫౯ శకమున మళఖేడ యను గ్రామమందు 'మధ్వసిద్ధాంతాభివృద్ధికారిణీసభ' అను సంస్థ యేర్పడెను. మధ్వసిద్ధాంతాభివృద్ధి, తత్ప్రచారము, తదధ్యేతల పోషణము ముఖ్యలక్ష్యముగాగల యీసంస్థకుస్వాములవారు నాల్గులక్షలరూప్యములుమూలధనముగా నొసంగిపోషించిరి. భారతదేశమంతయు సంచరించి స్వాములవారు పెక్కువిద్వత్సమావేశములు గావించిరి.

౧. కాశీ ఇందు శివకుమార శాస్త్రియనువారు ప్రముఖులు. (1912)

౨. చికోడి బాలగంగాధరతిలక్ రచించిన గీతారహస్యముపైన విచారసభ. (1917)

౩. పద్మపురాణస్థమగు అద్వైతవిమర్శనపూర్వకమగు శ్లోకములు ప్రక్షిప్తములు కావనియు, గ్రంథస్థవిషయమేయనియు నిర్ణయింపబడినది.

౪. ధారవాడ- విద్యాధీశకృత దినత్రయ నిర్ణాయక విషయమైన జ్యోతిశ్శాస్త్రప్రసంగము. (1928)

౫. మైసూరు ఇందు విరూపాక్షశాస్త్రులవారు ప్రముఖులు, స్వాములవారీ నగరమందు గీతోపన్యాసములు విరివిగా నొసంగిరి.

౬. తిరుచానూరు పద్మావతీ క్షేత్రము రామసుబ్బశాస్త్రిగారిచే రచింపబడిన చంద్రికాఖండనమును విమర్శింపుచు స్వాములవారు చంద్రికాఖండన మొనరించిరి. రామసుబ్బశాస్త్రిగారు సభకు రానందున పండిత సమక్షమున 'చంద్రికామండనోత్సవము' జరిపించిరి.

౭. కుంభకోణము ఇందు అనంతకృష్ణశాస్త్రిగారు, దండపాణి శాస్త్రిగారు ప్రముఖులు. ౨౧రోజులు సభలు నడిచినవి. ముఖ్యముగా గీతలోని క్షేత్రజ్ఞ విచారముపై వాదోపవాదములు జరిగినవి.

౮. మధుర ఇందు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రముఖులు.

౯. గయ పిష్టపశునిర్ణాయకమగుసభ జరిగెను.

౧౦. విజయనగరము } ఇందు శ్రీపాద అక్కినరసింహ శాస్త్రిగారు, దిండుకూరి నరసింహశాస్త్రిగారు, తాతా సుబ్బరాయశాస్త్రిగారు ప్రముఖులు. 'యతోహి ద్వైతమివ భవతి, తత్త్వమసి' వాక్యములపై వాదోపవాదములు జరిగినవి.

౧౧. బొంబాయి ఇంకొకసభ జరిగెను.

పై సభలన్నిటియందు ద్వైతమత ప్రాశస్త్యము బహువిధములుగా స్వాములవారిచే నిర్ణయింపబడెను. ఈసభల వృత్తాంతము లన్నియు వేఱువేఱుగా ప్రకటింపబడియున్నవి.

సంస్కృతము, తెనుగు, కన్నడము, తమిళము, మహారాష్ట్రము, హిందీ ఈభాషలందు స్వాములవారికి సంపూర్ణమైనప్రజ్ఞయుండెను. ఈభాషలందనర్గళముగా స్వాములవారాయా విద్వత్సభలందు ప్రసంగించియుండిరి.

౧ వేదాంతవిచారము సివిల్ కేస 4 వాల్యూములు.
౨ శ్రీమద్భగవద్గీత ప్రతిపదార్థతాత్పర్యసహితవిచారము
3 శ్రీమద్భగవద్గీతాతత్త్వము గీతోపన్యాసములు ౨ భాగములు.
౪ చంద్రికామండనము
౫ మధ్వసిద్ధాంతవిచారము.

ఈ గ్రంథములను స్వాములవారు రచించిరి. మఱియు దేశభాషలందనువాదము చేయించి ప్రచారము గావించిరి. చిత్రభాను చైత్ర శు 3 రోజున పండరీపురమున సిద్ధిపొందిరి.

### ౩౯. సత్యప్రజ్ఞతీర్థులు ౧౮౬౩-౧౮౬౫.

వీరి పూర్వాశ్రమనామము పాండురంగ జయరామాచార్యులుగారు. చక్కని శాస్త్రజ్ఞానము, తదుచితమైన ప్రవర్తనముఁగల్గి ఉత్తరాదిమఠమును పాలించిరి. తారణ చైత్ర శు ౨ రోజున రాయచూరు సమీపమున ఆత్మకూరులో సిద్ధిపొందిరి.

### ౪౦. సత్యాభిజ్ఞతీర్థులు. ౧౮౬౫-౧౮౬౭

వీరి పూర్వాశ్రమనామము కోసునూరు వెంకన్నాచార్యులుగారు. బాల్యవయస్సుననే యత్యాశ్రమమును స్వీకరించిరి. పాండిత్యమున, ఆచారవిషయమున శోభించిరి. సర్వజిత్తు పుష్య బ౨ రోజునరాబీబెన్నూరులో సిద్ధిపొందిరి.

మధ్వాచార్యులనుండి అవిచ్ఛిన్నముగా నేర్పడిన ఉత్తరాదిగురుమండలము సద్వైష్ణవుల ననేకులను దరింపజేసియున్నారు.



శ్రీనివాస ముద్రాశాలయము, రాజమహేంద్రవరము.